# శ్రీ పాద సప్తతి ( అమ్మవారి పాదాలను నుతిస్తూ భట్టాత్రి వ్రాసిన 70 శ్లోకాలు)

(ప్రతి పదార్థము, తాత్పర్యము, విశేషములతో)

**ఆచార్య తాడేపల్లి పతంజలి**



**శ్రీ శివాయ గురవే నమః**

**శ్రీ కారం**

నా జీవితంలో భగవంతుడు చేయించిన అద్భుతమైన కార్యక్రమం 1138 పుటలు కలిగిన శ్రీ మన్నారాయణీయ గ్రంథ రచన ( ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు).శ్రీ గుడిపాటి శ్రీ రామకృష్ణ శర్మ గారి ప్రేరణతో , శ్రీ రామోరా మోహన పబ్లికేషన్స్ సౌజన్యంతో ఇప్పుడు అది పుస్తక రూపంలో కూడా దొరుకుతున్నది.

ఈ శ్రీ మన్నారాయణీయము చదువుతున్న శ్రీ సాయిశ్రీ పవన్ ఈ పవిత్రమైన కార్తిక మాసపు ప్రారంభపు రోజున (26-10-22) నన్ను ఇలా కోరారు.

**"I am going through Your Naryaneeyam sir. It is an excellent piece of work. The above work is "Sri pada Saptati " of Narayana Bhatathiri. It consists of 70 Slokas if possible can you please go through the work.**

ఇది చదివిన తరువాత భగవంతుడు ఇలా ఒక సందేశం పంపి నన్ను ఆజ్ఞాపించాడని భావన కలిగింది.

ఇంతవరకు శ్రీ పాద సప్తతిని సాకల్యంగా చదవలేదు. నాకు తెలిసినంతవరకు దీనికి తెలుగులో అనువాదం లేదు.

రోజుకి 100 కిమీదాకా ప్రయాణం.. ప్రభుత్వ డిగ్రీ కళాశాలాధ్యక్షునిగా బాధ్యతలు.. తితిదే వారికి ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాస్తానని ఒప్పుకొన్న 27,28,29 సంపుటాలలోని 932 అన్నమయ్య కీర్తనల వ్యాఖ్య. దానికి తోడు ఈ యొక్క అనువాదం... వీటన్నింటికి సమయం సరిపోతుందా ? అని ఒక బెంగ .

నా గొంతు చిన్నది... జీవితం చిన్నది కాని జ్ఞాన తృష్ణతో మింగాలనుకొన్న పుస్తకాలు ఎక్కువ...

అయినప్పుడు పూర్తి అవుతుందిలే... స్వామి దయతో ప్రారంభిద్దామని ఒక తెగింపు.. కార్తిక దామోదరుడే వ్రాయించుకొంటాడు. అందుకే ఇలా శ్రీ కారం చుట్టాను.

నేపథ్యం

శ్రీ మేల్పత్తూర్ నారాయణ భట్టాత్రి కేరళలోని గురువాయూర్ దేవుడైన శ్రీకృష్ణుని ఆత్మీయంగా స్తుతిస్తూ నారాయణీయం అనే అద్భుతమైన భక్తిరస గ్రంథాన్ని రచించారు. ఇది శ్రీమద్ భాగవతం యొక్క సారాంశాన్ని ప్రతిబింబిస్తుంది . మరియు ప్రతి అధ్యాయం చివరలో కృష్ణుడు తన తల ఊపి, ముఖ్యమైన సందర్భాలలో అతనికి ప్రత్యేక దర్శనం ఇచ్చాడని ప్రతీతి.. భట్టాత్రిని చాలా కాలంగా బాధపెట్టిన కుష్టు వ్యాధి ఈ గ్రంథ రచనతో నయమైంది. అయినప్పటికీ విచిత్రంగా అతను మనశ్శాంతిని కోల్పోయాడు. ( ఆతనిచే వ్రాయంచటానికి గురువాయూరు దేవుడు పెట్టిన పరీక్ష ఇది)

గురువాయూర్ ప్రభువు అతనికి కలలో కనిపించి, ముక్తిస్థల (గురువాయూర్ సమీపంలో ఉన్నదట) అనే ప్రదేశానికి వెళ్లి దుర్గా దేవిని పూజించమని సూచించాడు. అక్కడ భట్టాత్రి, అమ్మవారి దర్శనం తర్వాత, శ్రీపాద సప్తతి పేరుతో దేవి యొక్క పవిత్ర పాదాలను స్తుతిస్తూ 70 శ్లోకాలు రచించాడు. అతను ధన్యుడయి మనలను ధన్యులు చేసాడు.

శ్లోకం 1

శార్దూలవిక్రీడితము

దక్షాధఃకరపల్లవే లసదసిం దక్షోర్ధ్వగే శూలినీం
వామోర్ధ్వే ఫలకోజ్జ్వలాం కటితటన్యస్తాన్యహస్తాంబుజాం .
శూలాగ్రాహతకాసరాసురశిరోనిష్ఠాం ప్రహృష్టాం సురైర్-
జుష్టామిష్టఫలప్రదాం భగవతీం ముక్తిస్థలస్థాం భజే ..

ప్రతిపదార్థము

దక్ష+అధఃకరపల్లవే = నిపుణమైన, లేత లతను పోలిన దిగువ కుడి చేతిలో; లసత్+అసిం = మెరుస్తున్న కత్తిని కలిగి ఉన్న; దక్ష+ఊర్ధ్వగే = నిపుణమైన ఎగువ కుడి చేతిలో; శూలినీం = త్రిశూలమును కలిగి ఉన్నది; వామ+ఊర్ధ్వే = ఎగువ ఎడమ చేతిలో (మీరు "ఎగువ కుడి" అని ఇచ్చారు, కానీ సంస్కృతంలో 'వామ' అంటే ఎడమ); ఫలక+ఉజ్జ్వలాం = ఒక అద్భుతమైన కవచమును; కటితట = నడుముపై; న్యస్త = ఉంచబడిన; అన్యహస్త+అంబుజాం = మరొక కమలమువంటి ఎడమ చేయి కలిగినదియు; శూల+అగ్ర = త్రిశూలపు చివర; ఆహత = దెబ్బతిన్న, నాశనము చేయబడిన; కాసర+అసుర = మహిషాసురుని; శిరో నిష్ఠాం = శిరస్సును స్థిరంగా కలిగి ఉన్నదియు; ప్రహృష్టాం = బాగా సంతోషించినదియు; సురైః =

దేవతలచేత; జుష్టామ్ = సేవింపబడినదియు; ఇష్టఫలప్రదాం = కోరుకున్న ఫలములను ఇచ్చునదియు అయిన; ముక్తిస్థలస్థాం = ముక్తిస్థలంలో నివసించే; భగవతీం = పూజ్యురాలిని; భజే = సేవిస్తాను.

**తాత్పర్యము**

లేత లతను పోలిన దిగువ కుడి చేతిలో మెరుస్తున్న కత్తిని కలిగి, ఎగువ కుడి చేతిలో త్రిశూలమును ధరించి, ఎగువ ఎడమ చేతిలో అద్భుతమైన కవచమును కలిగి, నడుముపై మరొక కమలమువంటి ఎడమ చేయి ఉంచి, తన త్రిశూలం చివర మహిషాసురుని శిరస్సును స్థిరంగా కలిగియుండి, బాగా సంతోషించినదియు, దేవతలచేత సేవింపబడినదియు, కోరుకున్న ఫలములను ఇచ్చునదియు అయిన ముక్తిస్థలంలో నివసించే పూజ్యురాలయిన పార్వతీదేవిని నేను సేవిస్తాను.

**విశేషాలు**

అమ్మవారి చతుర్భుజాల వర్ణన మనోహరంగా ఉన్నది. కత్తి దుష్ట సంహారానికి, త్రిశూలము ధర్మార్థకామములకు, కవచము భక్త రక్షణమునకు ప్రతీకలు. అమ్మవారు "కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ" (86వ లలితా సహస్రనామం). పంచదశీమంత్రములో మధ్యగా ఉన్న కూటమయిన "హసకహలహ్రీం" అను బీజాక్షర సముదాయము - కంఠం క్రింది భాగం నుండి నడుము, లేదా నాభివరకు ఉండే అమ్మవారి సూక్ష్మశరీర భాగాన్ని సూచిస్తుంది. 'హ'తో ప్రారంభమయ్యే ఈ కూటాన్ని 'హాది కూటము' అంటారు. దీనినే 'కామరాజ కూటము' అని కూడా అంటారు. దీనిని సూచిస్తూ భట్టాత్రి కూడా అమ్మవారి కటి ప్రస్తావనను "కటితటన్యస్తాన్యహస్తాంబుజాం" (=నడుముపై ఉంచబడిన మరొక కమలమువంటి ఎడమ చేయి కలిగినది) అని ఈ ప్రారంభ శ్లోకంలో చేసాడు.

---

**శార్దూలవిక్రీడితము**

**యత్సంవాహనలోభినఃశశికలాచూడస్య హస్తాంబుజ-**
**స్పర్శేనాపిచ లోహితాయతి ముహుస్త్వత్పాదపంకేరుహం**
**తేనైవోద్ధతకాసరాసురశిరశ్శృంగాగ్రసంచూర్ణన-**
**ప్రాచండ్యంతదనుష్ఠితం కిల కథం ముక్తిస్థలస్థే! శివే! .. 1..**

**ప్రతిపదార్థము**

ముక్తిస్థలస్థే = ముక్తిస్థల నివాసినీ!; శివే = శుభప్రదురాలా!; యత్, త్వత్ = ఏ నీ పాదము; సంవాహన = నీ పాదములను పిసికెడి; లోభినః = లోభగుణము కలిగిన; శశికలాచూడస్య = చంద్రుని కళతో అలంకరించబడిన శ్రీపరమేశ్వరుని యొక్క; హస్త+అంబుజ స్పర్శేన+అపి చ = పద్మహస్తపు స్పర్శతో; ముహుః = వెంటనే; లోహితాయతి = ఎర్రగా కమిలిందో; తేన పాదపంకేరుహం ఏవ = ఆ కమల పాదమే; ఉద్ధత = గర్వించిన; కాసర+అసుర = మహిషాసురుని; శిరశ్శృంగ+అగ్ర = తల అను కొండకొమ్ము యొక్క; సంచూర్ణన = పొడి చేయుటయందు; ప్రాచండ్యం = భయంకరత్వాన్ని; అనుష్ఠితం = ఆచరించింది; తత్ కథం కిల = అది ఎలా జరిగిందో కదా!

**తాత్పర్యము**

మంగళాంబికే! ముక్తిస్థల నివాసినీ! చంద్రుని కళతో అలంకరించబడిన శ్రీపరమేశ్వరుడు తన పద్మహస్తంతో మీ కమల పాదాన్ని పైకి ఎత్తాలనే కోరికతో తాకాడు, అది వెంటనే ఎర్రగా మారింది. అదే (కోమలమైన) పాదంతో, పర్వతం కంటే పెద్ద శరీరం ఉన్న మహిషాసురుని తలను మీరు భీకరంగా పొడిచారు. ఇది ఎలా సాధ్యమైంది?

**విశేషాలు**

ముక్తిస్థలం అనునది దేవాలయం కావచ్చు లేదా మోక్షానికి తగిన గొప్ప వ్యక్తుల హృదయం కావచ్చు. దేవియొక్క కమల పాదాల సున్నితత్వం మరియు కాఠిన్యం యొక్క వ్యతిరేక లక్షణాల యొక్క ఏకకాల వ్యక్తీకరణను భట్టాత్రి అందంగా తీసుకువచ్చారు. మంచిని రక్షిస్తుంది మరియు చెడును నాశనం చేసే ఆమె ఉగ్రతను ఈ వర్ణన సూచిస్తుంది. దుర్గా సప్తశతిలో, మహిషాసురుని వధించిన తర్వాత దేవతలు దేవిని ఇలా ప్రార్థిస్తారు: ''మంచివారి ఇళ్లలో లక్ష్మీదేవిగా నివసించే దేవి దుర్మార్గుల ఇళ్లలో అలక్ష్మిగా మారుతుంది.''(4-5) ఇది ఇక్కడ స్మరించుకోదగినది.

---

శార్దూలవిక్రీడితము

త్వత్పాదంనిజమస్తకే ఘటయితుం కే కే నులోకే జనాః

కింకిం నారచయంతి దుశ్చరతపశ్చర్యాసపర్యాదికం

మన్యేధన్యతమం తు దేవి! మహిషంవైరస్థయైవ త్వయా

యన్మూర్ధ్నిస్వయమేవ పాతకహరం పాదాంబుజం పాతితం .. 2..

ప్రతిపదార్థము

దేవి = దేవీ!; త్వత్ పాదం = మీ శ్రీ పాదాన్ని; నిజమస్తకే = తమ తలలపై; ఘటయితుం = ఉంచుకోవడం కోసం; లోకే = లోకమునందు; కే కే జనాః ను = ఎవరెవరైతే జనులున్నారో, నిశ్చయముగా (వికల్ప-అనునయ-ప్రశ్న-హేతు-వితర్క-అవమాన-ఉపదేశ-నిశ్చయేషు వికల్పము; అనునయము; ప్రశ్న; కారణము; వితర్కము; అవమానము; ఉపదేశము; నిశ్చయములందు ను అను అవ్యయము ప్రయోగింపబడును); కిం కిం నారచయంతి = ఏమేమి చేయకుండా ఉండలేరు కదా! (ఎన్నెన్నో చేస్తారని భావం); దుశ్చరతపశ్చర్యాసపర్యా+ఆదికం = చాలా కష్టతరమైన తపస్సులు, పూజలు మొదలైనవాటిని; త్వయా = నీపట్ల; వైరస్థయైవ = శత్రుత్వం కలిగి ఉన్నప్పటికీ; యత్ = ఎవరి; మూర్ధ్ని = తలను; స్వయమ్+ఏవ = స్వయముగా; పాతకహరం = సకల పాపాలను నాశనం చేసే; పాద+అంబుజం = నీ పాద కమలము; పాతితం = అణగదొక్కినదో; మహిషం = ఆ మహిషాసురుని; ధన్యతమం తు = వీరందరిలో అత్యంత అదృష్టవంతుడని; మన్యే = తలచుచున్నాను.

తాత్పర్యము

దేవీ! మీ శ్రీ పాదాన్ని తలపై ఉంచుకోవడం కోసం, మూడు లోకాలలోని అన్ని రకాల ప్రజలు (దేవతలు, యక్షులు, గంధర్వులు మొదలైనవారు) చాలా కష్టతరమైన తపస్సులు, పూజలు మొదలైనవాటిని ఆశ్రయిస్తారు. అయినప్పటికీ వీరందరిలో మహిషాసురుడు, అత్యంత అదృష్టవంతుడని నేను భావిస్తున్నాను. అతను నీ పట్ల శత్రుత్వం కలిగి ఉన్నప్పటికీ, సకల పాపాలను నాశనం చేసే నీ పాద కమలాన్ని తన తలపై ఉంచుకున్నాడు.

---

శ్లోకం 3

శార్దూలవిక్రీడితము

త్వత్పాదాంబుజమర్పితంక్వ ను శివే! కిన్నుత్రయీమస్తకే?

నిత్యంతత్త్వవిచారదత్తమనసాం చిత్తాంబుజాగ్రేషు వా? .

కింవా త్వత్ప్రణయప్రకోపవినమన్మారారిమౌలిస్థలే?

కింప్రోత్ఖండితఘోరసైరిభమహాదైత్యేంద్రమూర్ధాంతరే? .. 3.

ప్రతిపదార్థము

శివే! = శుభాలను కలిగించు మంగళాంబికా!; త్వత్+పద+అంబుజమ్ = నీ కమలములవంటి పాదాలు; అర్పితం క్వ ను = ఎక్కడ ఉన్నాయి?; త్రయీ = మూడు వేదాల; మస్తకే = తలపై; కిన్ను = అదియో, ఇదియో, (ఉన్నాయా?); వా = లేక; నిత్యం = ఎప్పుడూ; తత్త్వవిచారదత్తమనసాం = పరమ సత్యంలో లీనమైన మనస్సు కలిగిన యోగుల; చిత్త+అంబుజ+అగ్రేషు = హృదయ పద్మాల చివరలలో, (కిన్ను = ఉన్నాయా?); కిం వా = లేదా; త్వత్+ప్రణయప్రకోప = నీ ప్రణయ కోపం తర్వాత; వినమత్+మార+అరి = నమస్కారం చేయుచున్న మన్మథ శత్రువైన శివుని; మౌలిస్థలే = కిరీట స్థలములో (తలపై) (కిన్ను = ఉన్నాయా?); ప్ర+ఉత్ఖండిత = బాగా ఖండించబడిన; ఘోర = భయంకరమైన; మహాదైత్య+ఇంద్ర = రాక్షసాగ్రేసరుడయిన; సైరిభ = మహిషాసురుని; మూర్ధ+అంతరే = తల మధ్యలో; కిం = (క్షేపే వితర్కే నిందాయాం పరిప్రశ్నే చ) ఉన్నాయా ఏమి?

తాత్పర్యము

మంగళాంబికా! (శుభాలను కలిగించే తల్లీ)! నీ కమలములవంటి పాదాలు ఎక్కడ ఉన్నాయి? అవి మూడు వేదాల మస్తకముపై ఉన్నాయా? లేక ఎల్లవేళలా పరమ సత్యంలో లీనమై ఉండే యోగుల హృదయాలలో ఉన్నాయా? లేదా మన్మథ శత్రువైన శివుడు, ప్రణయ కోపం తర్వాత నిన్ను శాంతింపజేయడానికి సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు అతని తలపై ఉన్నాయా? లేక ఖండించబడిన శిరస్సు కలిగిన భయంకరమైన మహిషాసురుని తల మధ్యలోనా?

విశేషాలు

శ్రుతీనాం మూర్ధానో దధాతి ....... (84 వ సౌందర్యలహరి శ్లోకం) అను శంకరభగవత్పాదుల శ్లోకం ఈ సందర్భంలో స్మరణీయమైనది. ఆ శ్లోక భావమిది: అమ్మా! నీ పాదపద్మాలను ఉపనిషత్తులు తమ తమ శిరోభూషణాలుగా అలంకరించుకొంటున్నాయి. మహేశ్వరుడు నీ అలుక తీర్చే నెపంతో నీ చరణ పద్మాలను తన జటాజూటానికి తాకించుకొంటాడు. శ్రీమహావిష్ణువు ప్రతినిత్యం నీ పాదారవిందాలకు నమస్కరించి నీ పాదాలకున్న లాక్షారసకాంతిని తన శిరోరత్నమైన కౌస్తుభానికి అంటిస్తాడు. అట్టి పావనమైన నీ చరణపద్మాలను నా శిరస్సుపై రవ్వంత దయతో ఉంచు.

---

శార్దూలవిక్రీడితము

త్వత్పాదాంచలరూపకల్పలతికాబాలప్రవాలద్వయం

యే తావత్కలయంతి జాతు శిరసా నమ్రేణకమ్రోజ్జ్వలం

తేషామేవహి దేవి! నందనవనక్రీడాసు లభ్యం పునః

స్వర్వల్లీతరుణప్రవాలభరణంసేవానురూపం ఫలం..4

ప్రతిపదార్థము

దేవి! = దేవీ!; యే = ఎవరు; త్వత్ = నీ; కల్పలతికాబాలప్రవాలద్వయం = కల్పవృక్షం యొక్క లేత లతలని పోలి; కమ్ర+ఉజ్జ్వలం = అందంగా మెరుస్తున్న; పాద+అంచలరూప = మీ పాదద్వయరూపంలో ఉన్న (మీ పాదద్వయానికి); జాతు = ఒకప్పుడు; తావత్ = అంతట నిండిన భక్తితో; నమ్రేణ శిరసా = వినయంతో శిరస్సుతో నమస్కరిస్తారో (సాష్టాంగ నమస్కారం చేస్తారో); తేషామ్+ఏవ = వారికే; నందనవనక్రీడాసు = స్వర్గంలోని అందమైన ఉద్యానవనాలలో; కలయంతి = (ఆడుకొన్నట్లుగా) భావిస్తున్నారు; పునః = మరలా; స్వః+వల్లీతరుణప్రవాలభరణం = కల్పవృక్షం యొక్క లేత రెమ్మలను (తీసుకుంటారు); సేవ+అనురూపం = వారి సేవకు అనుగుణంగా; ఫలం = ఫలితము; లభ్యం = లభిస్తుంది; హి = కదా!

తాత్పర్యము

దేవీ! మీ పాదద్వయం అందంగా మరియు మెరుస్తూ ఉంటుంది. ఇవి కల్పవృక్షం యొక్క లేత లతలని పోలి ఉంటుంది. మీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసేవారు స్వర్గంలోని అందమైన ఉద్యానవనాలలో ఆడుకుంటారు మరియు అక్కడ కల్పవృక్షం యొక్క లేత రెమ్మలను తీసుకుంటారు. వారి సేవకు అనుగుణంగా ఫలం ఉంటుంది.

విశేషాలు

సేవానురూపం ఫలం (సేవకు అనుగుణమయిన ఫలితము). స్వర్గసుఖాలను కోరుకునే వారు స్వర్గానికి వెళతారు. విముక్తి కోసం ప్రార్థించే వారికి మోక్షం లభిస్తుంది. ఇది అమ్మవారి పాదాల మహిమ. దుర్గాసప్తశతిలో సురథుడు అనే రాజు తన తదుపరి జన్మలో నిరంతర రాజ్యాధికారం కోసం దేవిని ఎలా ప్రార్థించాడు. అలాగే సమాధి అను వైశ్యుడు నేను మరియు నాది అనే భావన నుండి విముక్తి పొందాలని ప్రార్థించాడు కథనంతో ముగుస్తుంది. దేవి రాజు కోరికను అనుగ్రహించి అతనిని సావర్ణి అనే తదుపరి మనువుగా చేసింది. వైశ్యుడు పరమ జ్ఞానాన్ని పొందాడు.(13:23, 13:25)

---

శార్దూలవిక్రీడితము

ధావల్యంపరిలాల్యతే పురరిపోరంగేన తుంగశ్రియా
కించశ్యామలిమాపి కోమలతరే భాత్యేవ గాత్రే హరేః .
తత్తాదృక్పదవీంమమాపి జనయేదస్తోకసేవారసా-
దారుణ్యంతవ లీయతే చరణయోః కారుణ్యమూర్తే! శివే! .. 5

ప్రతిపదార్థము

కారుణ్యమూర్తే! = కరుణా స్వరూపిణీ!; శివే = శుభప్రదురాలా!; ధావల్యం = నీ శరీరంలోని తెలుపురంగు; పురరిపోః+అంగేన = మూడు నగరాలకు శత్రువు అయిన దేవుని శరీరంలో; తుంగశ్రియా = పొడవైన కాంతి సంపదతో కలిసి; పరిలాల్యతే = బాగా ప్రకాశిస్తున్నది; కించ = మరియు; శ్యామలిమా+అపి = నీ శరీరంలోని నల్లనిరంగు; హరేః = విష్ణువు యొక్క; గాత్రే = శరీరములో; కోమలతరే = లేత సౌందర్యంతో; భాతి+ఏవ = ప్రకాశిస్తున్నది కదా!; మమ+అపి = నాకు కూడా; అస్తోక = గొప్పదయిన (స్తోకముకానిది. స్తోకము = అల్పము); సేవారసాత్ = సేవ చేసినందుకు; ఆరుణ్యం = నీ పాదాలలోని ఎఱ్ఱదనము; తత్+తాదృక్ +పదవీం = అటువంటి మార్గమును; జనయేత్ = కల్పించుచూ; తవ = నీయొక్క; చరణయోః = పాదాలలో; లీయతే = (భయముతో) కలిసిపోతున్నది.

తాత్పర్యము

కరుణాస్వరూపిణీ! శుభప్రదురాలా! నీ శరీరంలోని తెలుపురంగు, మూడు నగరాలకు శత్రువు అయిన శివుని శరీరంలో, పొడవైన కాంతి సంపదతో కలిసి బాగా ప్రకాశిస్తున్నది. నీ శరీరంలోని నల్లని రంగు విష్ణువు యొక్క శరీరములో కలిసి, లేత సౌందర్యంతో ప్రకాశిస్తున్నది కదా! కానీ నీ పాదాల ఎర్రదనం దానికి నేను గొప్పగా సేవ చేసినందున, శివుడు మరియు విష్ణువుతో సమానమైన స్థానం నాకు నువ్వు ఇస్తావని భయపడి ఆ పాదాలలో కలిసిపోతున్నది. (నేను నీ పాదాలను గట్టిగా పట్టుకున్నప్పుడు ఎరుపు మాయమవుతున్నది. కారణం నువ్వు నాకు శివ, విష్ణువుల స్థానం ఇవ్వబోతున్నావని ఆ ఎరుపు రంగుకి తెలుసునని చమత్కారం. అమ్మ పాదాలు ఎర్రగా ఉంటాయని మొత్తము మీద భావం.)

విశేషం

దేవీభాగవతం అక్షరజ్ఞానం లేని బ్రాహ్మణుడైన సత్యవ్రత కథను వివరిస్తుంది. అతను ఎప్పుడూ సత్యమే మాట్లాడేవాడు. తెలియకుండానే, అతను ఒక సందర్భంలో దేవి యొక్క మార్మిక అక్షరమైన బీజాక్షరమయిన ఐమ్‌ను ఉచ్చరించాడు. దేవి

అతన్ని వాల్మీకి వంటి అసమాన పండితుడిగా మరియు కవిగా చేసింది. (3:11:39) ఇదే విధంగా అమ్మ పాదాల సేవ చేసినందుకు శివవిష్ణువుల స్థానం లభిస్తుందని భట్టాత్రి అమోఘమైన ఊహ చేసాడు. ఆమె దయ అలాంటిది.

---

శార్దూలవిక్రీడితము

ఆరుణ్యంయదిదం త్వదీయపదయోరాభాతి, తత్కేచన

ప్రాహుస్తుంగనితంబభారభరణక్లాంత్యాకిలోపాగతం .

అన్యేమాహిషమూర్ధపేషమిలితం రక్తద్రవం మన్వతే

మన్యేఽహంతు నతేషు సాంద్రమనురాగోద్గారమేవానయోః6

ప్రతిపదార్థము

త్వదీయపదయోః = మీ పాదాలలో; యత్+ఇదం = ఏ ఈ; ఆరుణ్యం = ఎరుపు రంగు; ఆభాతి = ప్రకాశిస్తున్నదో (మెరుస్తున్నదో); తత్ = ఆ ఎరుపురంగును; కేచన = కొందరు; తుంగ = ఎత్తయిన; నితంబభారభరణక్లాంత్యా = మీ వెనుకభాగాల బరువును మోయడం వల్ల; ఉపాగతం = వచ్చినదని; ప్రాహుః = అంటారు; కిల = కదా!; అన్యే = మరికొందరు; మాహిషమూర్ధ = మహిషాసురుని తలపై మీ పాదాలను ఉంచి; పేషమిలితం = పొడిగా చేసిన సమయంలో కలిసిపోయిన; రక్తద్రవం = రక్తద్రవపు ఎరుపురంగుగా; మన్వతే = భావిస్తారు; అహం తు = నేనయితే; నతేషు = మీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసే భక్తుల; సాంద్రమ్ = పరిపూర్ణమైన; అనురాగ+ఉద్గారమ్ ఏవ = ప్రేమచే బయటికి స్రవించిన అనురాగముగా; అనయోః = ఈ పాదాల ఎరుపును; మన్యే = తలుస్తున్నాను.

తాత్పర్యము

శాంకరీ! మీ శ్రీపాద పద్మాలపై ఈ ఎరుపు రంగు ఎలా ప్రకాశిస్తున్నది? మీ పెద్దవయిన వెనుకభాగాల బరువును మోయడం వల్ల మీ పాదాలు ఎర్రగా కందిపోయాయని కొందరు అంటారు. మరికొందరు మీరు మహిషాసురుని తలపై మీ పాదాలను ఉంచి, వాటిని పొడిగా చేసిన సమయంలో అతని రక్తపు రంగులో కలిసి మీ పాదాలు ఎర్రబడ్డాయని అంటారు. అయితే, సాష్టాంగ నమస్కారం చేసే భక్తులు మీ పాదాల పట్ల ఉన్న అపారమైన అనురాగము మీ పాదాల ఎరుపు రంగుగా మారిందని నేను భావిస్తున్నాను.

విశేషాలు

రాగము అను పదానికి ఎఱుపు రంగు, అనురాగము అని రెండు అర్థాలు. ఈ రెండు అర్థాలున్న రాగపదాన్ని కవి ఈ శ్లోక నాలుగవ పాదంలో అందంగా ప్రయోగించాడు. దేవి పాదాల ముదురు ఎరుపు రంగుకు సంబంధించిన ప్రాపంచిక వివరణలను భట్టాత్రి కవితాత్మకంగా తిరస్కరిస్తూ, చంద్రుని కిరణాల తాకిడికి చంద్రకాంత రాయి కరగడం ప్రారంభించినట్లే, దేవి పాదాలు ఆమె భక్తులతో రాగముతో (ఎఱుపు రంగు, అనురాగము) నిండిపోతాయని ఆయన నొక్కి చెప్పారు. శంకరాచార్యులు సౌందర్యలహరిలో "మీ భక్తులను భయంనుండి రక్షించడంలో మరియు వారికి కోరుకున్న దానికంటే ఎక్కువ ఫలాలను ఇవ్వడంలో మీ పాదాలు మాత్రమే నిపుణత్వము కలిగినవి" (4వ శ్లోకం) అని చెప్పారు. ఆభావ ఛాయ భట్టాత్రి ఊహలోకూడా ప్రతిఫలిస్తున్నది.

---

శార్దూలవిక్రీడితము

ప్రాహుఃపద్మసమాశ్రయం శతధృతిం త్వత్పాదపద్మాశ్రయా-

దంతస్త్వత్పదపద్మవీక్షణవశాత్కృష్ణోపిపద్మేక్షణః .
యత్పద్మార్చనమామనంతిసుధియో దారిద్ర్యవిద్రావణం
ముక్తిక్షేత్రగతే!భవాని! తదపి త్వత్పాదపద్మార్చనం .. 7..

ప్రతిపదార్థము

ముక్తిక్షేత్రగతే = ముక్తిక్షేత్రంలో నివసించేదానా!; భవాని = (భవస్య పత్నీ) శివుని పత్నీ!; సుధియః = (సుష్ఠు ధీః యస్య) మంచిబుద్ధి కల పండితులు; శతధృతిం = (శతం ధృతయ యస్య) వంద రెట్లు ధైర్యము కల బ్రహ్మని; పద్మసమాశ్రయం = పద్మనివాసుడని; ప్రాహుః = పిలుస్తారు; త్వత్+పాదపద్మ+ఆశ్రయాత్ = మీ పాద పద్మాలకు భక్తుడు కనుక పద్మమును ఆశ్రయించి (పద్మాసనుడయ్యాడు, కమలంపై కూర్చున్నందున కాదు); అంతః = లోపల; త్వత్ = మీయొక్క; పద పద్మ = పాదపద్మములను; వీక్షణ వశాత్ = చూస్తుండుట వలన; కృష్ణః+అపి = కృష్ణుడు కూడా; పద్మ+ఈక్షణః = పద్మేక్షణుడయ్యాడు (అతని కళ్ళు పద్మపురేకుల్లా కనిపించడం వలన కాదు); దారిద్ర్య = పేదరికాన్ని; విద్రావణం = (విద్రవతి పలాయతే తస్య భావః కర్మవా) పరుగులెత్తించటానికి (పోగొట్టటానికి); యత్+పద్మ +అర్చనం = ఏ పద్మ పూజని; ఆమనంతి = భావిస్తుంటారో, (అది సరికాదు); తదపి = అయినప్పటికీ; త్వత్ +పదపద్మ+అర్చనం = మీ కమల పాదాలను ఆరాధించడం (నిజమైన పద్మపూజ).

తాత్పర్యము

తాత్పర్యం 1: ముక్తిక్షేత్రంలో నివసించే భవానీ! బుద్ధిమంతులు బ్రహ్మను 'పద్మాశ్రయుడని పిలుస్తారు. కాని అతను మీ పాద పద్మాలకు భక్తుడు కనుక, పద్మమునందు ఇష్టం కలిగి పద్మాసనుడయ్యాడు. (అతను కమలంపై కూర్చున్నందున పద్మాసనుడు కాలేదు). కృష్ణుడు నిరంతరం మీ కమల పాదాలను తన లోపలి కళ్ళతో చూస్తున్నాడు కనుక 'పద్మేక్షణుడు' అని పిలువబడ్డాడు (అతని కళ్ళు పద్మపు రేకుల్లా కనిపించడం వల్ల కాదు). పేదరికాన్ని పారద్రోలడానికి లక్ష్మీదేవిని ఆరాధించడం పద్మార్చనంగా లోకంలో పరిగణించబడుతుంది, కాని పద్మార్చనమనగా మీ కమలపాదాలను ఆరాధించడం.

తాత్పర్యం 2: ముక్తిక్షేత్రంలో నివసించే భవానీ! మీ శ్రీపాదాలకు శరణాగతి చేసి, కమలాసనంలో కూర్చునే అదృష్టాన్ని బ్రహ్మ పొందాడు. శ్రీ కృష్ణుడు కూడా తన మనస్సులో మీ శ్రీపాద కమలాలను సదా దర్శనం చేసుకున్నందుకు కమల నేత్రాలను పొందాడు. ఏ మీ యొక్క శ్రీపాదకమలాలను సేవించుట ద్వారా, శ్రీ లక్ష్మి అన్ని దారిద్ర్యాలను తరిమి కొట్టే శక్తిని పొందిందో, అటువంటి మీ శ్రీపాదముల అర్చన చేసి సర్వదోషాలను పారద్రోలి సత్కతి పొందుతాను.

విశేషాలు

బ్రహ్మ, విష్ణువు, లక్ష్మి మరియు దేవతలందరూ, ప్రజలను అనుగ్రహించే శక్తులను కలిగి ఉన్నారు, వారు కేవలం దేవి పాదాలను పూజించడం ద్వారా ఆ శక్తులను పొందారని కవి ఊహ. శ్రీ నారాయణ భట్టాత్రి పదాల యొక్క సాధారణ అర్థాలను కవితాత్మకంగా తిరస్కరిస్తూ, వాటికి ప్రత్యేక అర్థాన్ని ప్రసాదించి, వాటిని దేవి పాదకమలాల యొక్క గొప్ప శక్తులతో అనుసంధానించారు. సౌందర్యలహరి మొదటి శ్లోకంలోనే శంకరభగవత్పాదులు విష్ణువు, శివుడు మరియు బ్రహ్మ అమ్మని పూజిస్తారని చెప్పారు. ఇది ఈ సందర్భంలో స్మరణీయమైనది. దేవిని చేరుకోవడానికి మూడు ప్రధాన మార్గాలు శరణు (భక్తి), మనస్సులో దర్శనం (జ్ఞానం), అర్చన (కర్మ), వరుసగా ఈ శ్లోకంలో సూచింపబడ్డాయి. ఈ మార్గాలన్నీ అమ్మవారి శ్రీపాదాల అనుగ్రహానికి దారితీస్తాయి.

---

శార్దూలవిక్రీడితము

పాదంతే సరసీరుహద్రుహమిమం యత్సేవతే పద్మభూ-

ర్నూనంతత్స్వనివాసపంకజవరశ్రీలంఘనాశంకయా

గోవిందోఽపిచ వారిరాశిదుహితుర్వాసాబ్జబాధాభియా

స్వస్యైవాగ్రకరోద్గృహీతకమలత్రాణాభిలాషేణవా 8

ప్రతిపదార్థము

నూనం = నిశ్చయముగా; పద్మభూః = (పద్మం విష్ణోః నాభిపద్మం భూః ఉత్పత్తిస్థానం యస్య) విష్ణువు నాభి స్థానము ఉత్పత్తిగా కలవాడు (బ్రహ్మ); పద్మభవుడయినప్పటికీ ఆ బ్రహ్మ; పాదంతే = నీయొక్క; సరసీరుహ = (సరస్యాం రోహతి- సరస్సులో పెరుగునది) కమలమును; ద్రుహమ్ = అధిగమించిన; ఇమం = దీనిని (నీ పాదపద్మమును); తత్ = ఆ; స్వనివాసపంకజ = తన నివాసమైన పద్మపు; వరశ్రీ = శ్రేష్ఠమయిన కాంతి; లంఘన = (లంఘతే మర్యాదామతిక్రమ్య గచ్ఛతి) దాటి వెళ్లు; ఆశంకయా = (ఆశంకతే బిభేతి తస్య భావః) సంకోచముతో; యత్ = దేనిని (నీ పాదపద్మమును); సేవతే = సేవించుచున్నాడు.

వారిరాశి = (వారిణాం రాశయః అత్ర) జలరాశులు వుండు స్థలము, సముద్రము యొక్క; దుహితుః = (దోగ్ధి అపహరతి ధనం మాతృకులాత్) తల్లిగారి ఇంటి నుండి ధనమును తీసుకెళ్లునది (లక్ష్మీదేవి) కూతురయిన లక్ష్మీదేవియొక్క; వాస+అబ్జ = (వసంతి అత్ర ఇక్కడ నివసింతురు) గృహమయిన కమలపు; బాధా+భియా = (బాధతే తస్య భావః) కష్టము, పీడ భయముతో; గోవిందః+అపి చ = (గాం పృథివీం ధేనుం వాణీం వా విందతి) భూమిని, ఆవును సంతోషింప చేయువాడయిన విష్ణువు కూడా; (సేవించుచున్నాడా?); వా = లేక; స్వస్య+ఏవ = తనయొక్క (అయనం గమనం నిర్ధారణం ఏవ నిర్ధారణ సాదృశ్య పరిభవ స్వల్ప నిశ్చయాదిషు) నిశ్చయముగా; అగ్రకర = కుడిచేతితో; ఉత్+గృహీత = పైకి గ్రహింపబడిన; కమల = (కం జలం అలతిభూషయతి నీటిని అలంకరించునది) కమలమును; త్రాణ+అభిలాషేణ = రక్షించు కోరికతో; సేవతే = సేవించుచున్నాడు.

తాత్పర్యము

దేవీ! పద్మం నుండి పుట్టినప్పటికీ ఆ బ్రహ్మ, తన నివాసమయిన పద్మకాంతిని మించిన నీ పాదాలను పూజిస్తాడు. ఒకవేళ అలా పూజించక పోతే తన సొంత పద్మాసనం యొక్క వైభవం కోల్పోతాననే భయం కారణమా? నీ పాదపద్మ సేవ చేయకపోతే సముద్రపు పుత్రికైన లక్ష్మి పద్మాసనపు శోభను కోల్పోతుందనే భయంతో గోవిందుడు మీ పాదపద్మమును పూజిస్తున్నాడా? లేక తన కుడిచేతిలో పట్టుకున్న తామరపువ్వు అందాన్ని కాపాడడం కోసము నీ పాదపద్మ సేవ చేస్తున్నాడా?

విశేషాలు

అమ్మవారియొక్క శ్రీపాదాలు పైన పేర్కొన్న మూడు ప్రసిద్ధ కమలాల కాంతి వైభవాన్ని మించినవని భావం.

---

శార్దూలవిక్రీడితము

సేవంతేకులసంపదే నఖమయాః శీతాంశవస్త్వత్పదం

తత్పాకోనను వీక్ష్యతే హి నితరామన్యేషు శీతాంశుషు

ఏకోబాలక ఏవ మౌళిమయి! తేయాతో, లలాటాత్మతా-

మన్యోనిర్మలగండమణ్డలదశామన్యౌతు ధన్యౌ గతౌ .. 9.

ప్రతిపదార్థము

అయి! = ఓ తల్లీ!; తే = నీయొక్క; నఖమయాః శీతాంశవః = గోళ్లరూపంలో ఉన్నవారు నిజంగా చంద్రులే; కులసంపదే = వారు తమ వంశవైభవం కోసం; త్వత్ పదం = మీ పాదాలను; సేవంతే = పూజిస్తారు; తత్పాకః = అటువంటి పూజ యొక్క ఫలం; నను = నిశ్చయముగా; అన్యేషు శీతాంశుషు = వారి వంశంలోని ఇతర చంద్రులలో; నితరామ్ = ఎప్పుడూ స్పష్టంగా; వీక్ష్యతే హి = కనిపిస్తుంది కదా!; ఏకః బాలక ఏవ = ఒక చిన్నారి చంద్రుడేమో; మౌలిమ్ = నీ తలని; యాతః = అలంకరిస్తాడు; అన్యః = మరొక చంద్రుడు; లలాట+ఆత్మతామ్ = నుదిటిగా; యాతః = మారాడు; అన్యౌతు = మరో ఇద్దరు అదృష్టచంద్రులు; నిర్మలగండమణ్డలదశామ్ = మీ స్వచ్ఛమైన బుగ్గలుగా మారి; ధన్యౌ గతౌ = ధన్యత్వాన్ని పొందారు.

తాత్పర్యము

తల్లీ! మీ శ్రీపాదాల గోళ్లు నిజంగా చంద్రులే. వారు తమ వంశవైభవం కోసం మీ పాదాలను పూజిస్తారు. అటువంటి పూజ యొక్క ఫలం వారి వంశంలోని ఇతర చంద్రులలో స్పష్టంగా కనిపిస్తుంది; ఒక చిన్నారి చంద్రుడు నీ తలని అలంకరిస్తాడు; మరొక చంద్రుడు నీ నుదిటిగా మారాడు. మరో ఇద్దరు అదృష్ట చంద్రులు మీ స్వచ్ఛమైన బుగ్గలుగా మారారు.

విశేషాలు

దేవి, తన భక్తుని పట్ల కరుణతో, అతని పూర్వీకులు మరియు వారసుల మొత్తం కుటుంబాన్ని ఆశీర్వదిస్తుంది. చంద్రుడు చిన్నవాడయినప్పటికీ, ఆమె తలపై ఆభరణంగా ఉన్నాడు. ఆమె దయాగుణం అలాంటిది. సౌందర్యలహరిలో ఇలా చెప్పారు: లలాటం లావణ్య ద్యుతి విమలమాభాతి తవ యత్ ద్వితీయంతన్మన్యే మకుట ఘటితం చంద్రశకలమ్ (46) 'అమ్మా! నీ నుదురు నిత్యనూతన సౌందర్యం, ప్రకాశం, నిర్మలత అనే మూడు లక్షణాలతో, షోడశకళలతో ప్రకాశించే పౌర్ణమినాటి చంద్రునివలె భాసిస్తున్నది. అది అర్ధ చంద్రబింబంవలె కనిపిస్తున్నది'. చంద్రుని రెండవ అర్ధభాగం నువ్వు ధరించిన కిరీటంలో తురుమబడిన నెలవంకగా ఉన్నది. 'అష్టమీచంద్రవిభ్రాజ దళికస్థల శోభితా' (అష్టమినాటి చంద్రునివలె ఆమె నుదురు ఉన్నది.) అని లలితా సహస్రనామస్తోత్రంలో ఉన్నది. ఈ భావాలు ఈ భట్టాత్రి శ్లోకపఠన సమయంలో స్మరణీయాలు.

---

శార్దూలవిక్రీడితము

ఘోరంపాదసహస్రకం ప్రకటయన్నాశాసు భాసాం పతి-

ర్ధ్వాంతంనో పునరాంతరం శమయితుం శక్నోతి శైలాత్మజే! .

త్వత్పాదద్వితయేనకోమలతరేణానేన చేతఃస్పృశా

జంతూనాంబహిరంతరంధతమసం కృంతత్యనంతం శివే! 10..

ప్రతిపదార్థము

శైల+ఆత్మజే! = హిమవంతుని పుత్రీ!; శివే = శుభదాయకురాలా!; ఘోరం = భయంకరమైన (శక్తివంతమైన); పాదసహస్రకం = వేలాది కిరణాలను; ఆశాసు = వివిధ దిశలలో; ప్రకటయన్ = వ్యాపింపజేసే; భాసాం పతిః = సూర్యుడు; నః = మాయొక్క (మాలో); పునః = మరలా మరలా (అనేక జన్మలలో); ఆంతరం = లోపలిగా ఉండే; ధ్వాంతః = చీకటిని (అజ్ఞానం- అవిద్య); శమయితుం = శమింప చేయుటకు; న శక్నోతి = శక్తుడు కాలేకపోయాడు (తొలగించలేకపోయాడు); (కింతు = కానీ); త్వత్ = నీయొక్క; చేతఃస్పృశా = మనస్సు యొక్క పునాదిని తాకు సామర్థ్యము కలిగిన; కోమలతరేణ = మృదువైన; అనేన పాదద్వితయేన = నీ పాదద్వయముతో; జంతూనాం = జీవులలో ఉన్న; అనంతం = అంతులేని; బహిః = బాహ్యాము (మరియు); అంతః = అంతర్గతమయిన; అంధతమసం = చీకటిని; కృంతతి = తొలగిస్తావు.

**తాత్పర్యము**

**హిమవంతుని పుత్రీ! శుభదాయకురాలా! తన శక్తివంతమైన ప్రకాశించే వేలాది కిరణాలను వేలల్లో వివిధ దిశలలో వ్యాపింపజేసే సూర్యుడు ఇప్పటికీ జీవులలో ఉన్న అంతర్గత చీకటిని (అజ్ఞానం- అవిద్య) తొలగించలేకపోయాడు. కానీ మీ చాలా మృదువైన (కమలం) పాదాలు మనస్సు యొక్క పునాదిని తాకడంతో, మీరు జీవులలో ఉన్న భయంకరమైన బాహ్య మరియు అంతర్గత చీకటిని వేరు చేస్తారు.**

**విశేషాలు**

**జీవులలోని బాహ్య అంధకారం అనేది శరీరం, మనస్సు మరియు బుద్ధితో ఆత్మను అనుబంధించే ధోరణి. ప్రపంచంలోని వస్తువులను తన కంటే ఇతరమైనదిగా చూడటం మరియు వాటితో అనుబంధాన్ని పెంచుకోవడం. అంతర్గత చీకటి అంటే దేవి పాదాలను కాంతి, జ్ఞానం, క్రియ మరియు ఆనందానికి మూలంగా చూడలేకపోవడం. దేవి పాదాల వద్ద ప్రార్థించడం ద్వారా భక్తుడు జ్ఞానాన్ని, పరమ జ్ఞానము పొందుతాడని ఈ శ్లోకంలోని అంతరార్థం. సౌందర్యలహరిలో 03 వ శ్లోకంలో శంకరభగవత్పాదులు ఇలా అంటారు- "అవిద్యానమ్ అంతస్తిమిర మిహిర-ద్వీపనగరీ___( దేవీ! మీ పాద ధూళి ఉదయించే సూర్యుని నగరం వంటిది. ఇది భక్తుల అవిద్య అను దట్టమైన చీకటిని దూరం చేస్తుంది.)" ఈ భావం ఈ భట్టాత్రి శ్లోక పఠన సమయంలో జ్ఞాపకం చేసుకోదగినది.**

**శార్దూలవిక్రీడితము**

**సూర్యేంద్వగ్నిసమీరణాదిసకలస్వర్వాసినాముస్మదః**
**సర్వాణ్యేవపదానియోమథితవాన్ దుర్వారశౌర్యోష్మణా .**
**తం ఘోరం మహిషాసురం నిజపదేనైకేనసమ్మృద్నతీ**
**యత్త్వంప్రత్యకృథాస్తతః కిమపరం త్వద్వైభవం బ్రూమహే..11**

**ప్రతిపదార్థము**

**సూర్య+ఇందు+అగ్నిసమీరణ+ఆది = సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు మొదలైన; సకలస్వః వాసినామ్ = స్వర్గలోకంలో నివసించే సకల దేవతలందరినీ; దుర్వారశౌర్య+ఊష్మణా = తన అజేయమైన పరాక్రమంద్వారా; ఉన్మదః = పిచ్చివాడై; సర్వాణి+ఏవ పదాని = వారివారి స్థానాల నుండి; యః = ఎవడు; మథితవాన్ = తొలగేటట్లుగా హింసించాడో; తం ఘోరం మహిషాసురం = ఆ భయంకరమైన మహిషాసురుడిని; ఏకేన నిజపదేన = నీ ఒక్క శ్రీపాదంతో; త్వం = నువ్వు; సమ్మృద్నతీ = మర్దించి (నాశనం చేసి); ప్రతి+అకృథాః = అతనికి తగిన సమాధానం ఇచ్చావు (అతని దుష్కార్యానికి ప్రతీకారం తీర్చుకున్నావు); తతః = ఆ తర్వాత; యత్ = ఏదైతే; త్వత్+ అపరం వైభవం = వాక్కు మరియు మనస్సుకు అందని నీ యొక్క అత్యుత్తమమైన ఏ మహిమ ఉన్నదో; కిమ్ బ్రూమహే = దానిని గురించి ఏమి చెప్పగలము? (చెప్పటానికి అసాధ్యమని భావం).**

**తాత్పర్యము**

**దేవీ! సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు మొదలైన స్వర్గలోకంలో నివసించే ఇతర దేవతలందరినీ తన అజేయమైన పరాక్రమం ద్వారా మహిషాసురుడు వారి వారి స్థానాలనుండి తరిమికొట్టాడు. నీ ఒక్క పాదాన్ని ఉపయోగించి ఇంత భయంకరమైన అసురుడిని ఓడించి అతని దుష్కార్యానికి తగిన సమాధానం ఇచ్చావు. ఇంతకంటే వాక్కు మరియు మనస్సుకు అందని నీ మహిమ గురించి ఏమి మాట్లాడాలి? (చెప్పటానికి అసాధ్యమని భావం).**

**విశేషాలు**

**ఈ శ్లోకంలో 'పద' (= స్థానము, పాదము) శబ్దాన్ని అందంగా దేవతల పరంగా, అమ్మవారి పరంగా ప్రయోగించిన కవి నైపుణ్యం ప్రశంసనీయమైనది. దుర్గాసప్తశతిలో, మహిషాసురుడిని చంపిన తర్వాత దేవతలు దేవిని స్తుతిస్తూ ఇలా అంటారు: "కేనోపమాభవతు తేష్య పరాక్రమస్య" (మీ పరాక్రమంతో పోల్చి చూడగలిగేది ఏది? 4:22). ఈ భావం ఇక్కడ స్మరణీయమైనది.**

---

**శార్దూలవిక్రీడితము**

**ఏకంవామతయైవ, దక్షిణతయైవాన్యత్పదం దేహినాం**

**ఖ్యాతంముక్తిపురాధివాసిని! శివే!, చిత్రం త్వయి త్వీదృశం .**

**ఆనమ్రేషుజనేష్వభీష్టకరణే పాదావుభౌ దక్షిణా-**

**వానమ్రేతు కృతాగసి స్మరహరే వామాక్షి! వామావుభౌ .. 12..**

**ప్రతిపదార్థము**

**ముక్తిపుర+అధివాసిని = ముక్తిపుర వాసినీ!; శివే = శుభప్రదమైనదానా!; దేహినాం = శరీరధారులకు; ఏకం వామతయా+ఏవ = ఒకటి ఎడమగా; అన్యత్ = మరొకటి; దక్షిణతయా+ఏవ = కుడిగా; పదం = పాదాలుంటాయని; ఖ్యాతం = అందరికీ తెలుసు; చిత్రం త్వయి తు +ఈ దృశం = కానీ మీ విషయంలో ఇది; చిత్రం = విచిత్రమైనది.**

**ఆనమ్రేషుజనేషు+అభీష్టకరణే = భక్తులు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు; పాదౌ+ఉభౌ = మీ రెండు పాదాలు; దక్షిణౌ = కుడికాళ్లవుతాయి (దక్షిణ = దక్షతే ఉత్సహతే కార్యేషు సమర్థో భవతి కార్యములను సమర్థవంతంగా చేయునది. అంటే వారి కోరికలను తీర్చడంలో నేర్పు కలిగినవి అవుతాయని అంతరార్థం).**

**వామ+అక్షి = అందమైన కన్నులు గలదానా!; కృతాగసి = ఏదో బూటకపు అపరాధానికి (ప్రేమ) ప్రాయశ్చిత్తం చేసుకోడానికి; ఆనమ్రే తు = సాష్టాంగ నమస్కారం చేయటానికి వచ్చిన; స్మరహరే = మన్మథుని నాశనం చేసిన శివుని విషయంలో; ఉభౌ = మీ రెండు పాదాలు; వామౌ = ఎడమకాళ్లవుతాయి (వామమనగా వంకరగా, అతని కోరికను తీర్చడానికి ఇష్టపడవని అంతరార్థం).**

**తాత్పర్యము**

**ముక్తిపురవాసిని! శుభప్రదురాలా! ప్రతి ఒక్కరికీ రెండు పాదాలు ఉన్నాయని అందరికీ తెలుసు, ఒకటి కుడి పాదం (దక్షిణ) మరియు మరొకటి ఎడమ పాదం (వామ). కానీ మీ విషయంలో ఇది విచిత్రమైనది.**

**అందమైన కన్నులు గలదానా! భక్తులు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు, మీ రెండు పాదాలు కుడికాళ్లవుతాయి (అంటే వారి కోరికలను తీర్చడంలో నేర్పు కలిగినవి అవుతాయి). కానీ మన్మథుని నాశనం చేసిన శివుడు ఏదో బూటకపు అపరాధానికి (ప్రేమ) ప్రాయశ్చిత్తం చేసుకోడానికి మీకు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు, మీ రెండు పాదాలు ఎడమకాళ్లవుతాయి (అంటే వంకరగా, అతని కోరికను తీర్చడానికి ఇష్టపడవని అంతరార్థం).**

**విశేషాలు**

**'వామ' మరియు 'దక్షిణ' పదాలలో అందమైన శ్లేషల ద్వారా అమ్మ దయ యొక్క సమృద్ధిని కవి ఆమె భక్తులకు తెలియజేసాడు. మూకపంచశతిలో మూకకవి ఇలా అంటాడు: దేవి పాదాలు పేద భక్తులకు వారి ఊహకు మించిన వాటిని అనుగ్రహిస్తాయి. తద్వారా కల్పవృక్షాన్ని అపఖ్యాతిపాలు చేస్తాయి (2:60). ఈ భావం ఇక్కడ స్మరణీయమైనది.**

శార్దూలవిక్రీడితము

ఆనమ్రస్యపురద్రుహః శిరసి తే పాదాబ్జపాతః శివే!

జీయాద్యేనబభూవ పంకజవతీ మౌలిస్రవంతీ క్షణం .

కించోదంచితబాలపల్లవవతీజాతా జటావల్లరీ

లాక్షాపాతవశేనసాంధ్యసుషమాసాంద్రా చ చాంద్రీ కలా.. 13.

ప్రతిపదార్థము

శివే = శుభదాయకురాలా!; పురద్రుహః = త్రిపురాసుర సంహారకుడైన శివుడు; ప్రేమలో అతడు చేసిన బూటకపు పొరపాటు కారణంగా; ఆనమ్రస్య = తన తలతో నీకు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు; తే పాద+అబ్జ = నీ పాదపద్మములు; శిరసి = అతని తలయందును; పాతః = తాకాయి.

యేన = దేనిచేత నైనప్పటికి ఈ దృశ్యం; జీయాత్ = చిరకాలం మా మనస్సులలో జీవించుగాక!; మౌళి = శివుని జటాజూటములోని; స్రవంతీ = గంగా నది; క్షణం = ఒక క్షణకాలం; పంకజవతీ = ఎరుపు కమలంతో; బభూవ = అలంకరించబడింది (అమ్మవారి పాదము పద్మము కనుక, శివుని తలని తాకినప్పుడు, శివుని తలలోని గంగానది ఆ పాద పద్మంతో అలంకరించబడినదని ధ్వని).

కించ = మరియు; జటావల్లరీ = శివుని తలలోని జడల సమూహము అనే తీగ; బాలపల్లవవతీ జాతా = లేత మొలకలతో కూడుకొన్నట్లుగా; ఉదంచిత జాతా = విజృంభించి మెరుస్తున్నది (శివుని తలని తాకినప్పుడు అమ్మవారి పాదాల వేళ్ళు లేత మొలకల్లా శివుని జటాజూటమనే తీగపై జన్మించినట్లుగా మెరుస్తున్నాయని ధ్వని).

చ = మరియు; లాక్షాపాతవశేన = మీ పాదాల ఎరుపు లక్కకాంతితో; చాంద్రీ కలా = శివుని తలలోని చంద్రవంక; సాంధ్యసుషమాసాంద్రా = సంధ్యా సమయంలో కంటే ఎక్కువ మెరుపుతో ప్రకాశిస్తుంది (అమ్మవారి పాదం శివుని తలను తాకినప్పుడు ఆమె పాదాలలోని ఎరుపు చంద్రకళకు సోకి, అది సంధ్యా సమయంలో కంటే ఎక్కువ ఎరుపుకాంతితో ప్రకాశిస్తున్నదని భావం).

తాత్పర్యము

దేవీ! శుభదాయకురాలా! త్రిపురాసుర సంహారకుడైన శివుడు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు (ప్రేమలో అతడు చేసిన బూటకపు పొరపాటు కారణంగా) నీ పాదాలు అతని తలని తాకాయి. ఈ దృశ్యం మా మనస్సులలో చిరకాలం జీవించుగాక! అప్పుడు శివుని తలలోని గంగా నది ఒక క్షణకాలం ఎరుపు కమలంతో అలంకరించబడింది. అతని తలలోని సాధారణంగా పాడిగా ఉండే వెంట్రుక జడల సమూహము లేత మొలకల్లా (మీ తామర పాదాల వేళ్ల కాంతితో) మెరుస్తున్నాయి. మీ పాదాల ఎరుపు లక్కకాంతితో శివుని తలలోని చంద్రవంక సంధ్యా సమయంలో కంటే ఎక్కువ మెరుపుతో ప్రకాశిస్తున్నది.

విశేషాలు

మూకపంచశతిలో పాదారవిందశతకంలో చెప్పిన ఈ శ్లోకభావం ఈ సందర్భంలో స్మరణీయమైనది: ''సంధ్యాకాంతులు అమ్మవారి పాదాల ఎరుపు రంగును పొందాలని కోరుకుంటాయి. అమ్మవారి గోటియొక్క కాంతులను చూచి, వానిని పొందటానికా అన్నట్లు వెన్నెల బాధపడుతుంది. అమ్మవారి పాదాల మెత్తదనాన్ని పొందటానికి చిగురుటాకులు అభ్యాసం చేస్తుంటాయి. అలాంటి అమ్మ పాదాలను నా మనసులో వ్యాపింపజేస్తాను'' (2-23).

---

శార్దూలవిక్రీడితము

దృష్ట్వారాత్రిషు చంద్రపాదజనితాం పాథోరుహాణాం వ్యథాం

దేవి!త్వం కరుణాకులేవ కురుషే తద్వైరనిర్యాతనం .

మానానమ్రమహేశమౌలివలభీవాసస్యశీతత్విషో

నిత్యంపంకజపాదఘాతజనితా బాధా యదాధీయతే ..14

ప్రతిపదార్థము

దేవి! = దేవీ!; రాత్రిషు = రాత్రులలో; పాథోరుహాణాం = పద్మములకు; చంద్రపాదజనితాం = చంద్రుని కిరణాల వల్ల కలిగిన; వ్యథాం = బాధను (పద్మాలు ముడుచుకోవటం బాధ అని కవి ఊహ); దృష్ట్వా = చూసి; త్వం = నువ్వు; కరుణా+ఆకులా+ఇవ = పద్మము పట్ల దయ చూపించదలచినట్లు; తత్ +వైర నిర్యాతనం = పద్మముల పగ తీర్చుకొను అవకాశాన్ని; కురుషే = కలిగిస్తున్నావు; యత్ = అది ఎలాగనగా; మానానమ్ర = ప్రేమలో గొడవ తర్వాత నిన్ను శాంతింప చేయాలని నమస్కరించిన; మహేశమౌలివలభీవాసస్య = శివుని జటాజూటమను చంద్రశాలలో నివాసమున్న; శీతత్విషః = చంద్రుడు; నిత్యం = నిత్యము; పంకజపాదఘాతజనితా = నీ పాద పద్మముల తాకిడికి సంబంధించిన; బాధా = బాధను; అధీయతే = పొందుచున్నాడు.

తాత్పర్యము

దేవీ! రాత్రులలో చంద్రుని కిరణాల వల్ల పద్మాలు బాధపడతాయి (పద్మాలు ముడుచుకోవటం బాధ అని కవి ఊహ). మీరు అలుక బూనిన సమయంలో మిమ్మల్ని శాంతింపజేయడానికి శివుడు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు కమలం పట్ల కనికరంతో, మీరు చంద్రునికి బుద్ధి చెబుతారు. శివుని శిరస్సున నివసించే చంద్రుడు నీ పాద పద్మముల తాకిడికి గురవుతాడు (పద్మములను బాధపెట్టాడు కనుక అమ్మవారి పాదపద్మము శివుని బాధపెడుతున్నదని చమత్కారం).

---

శార్దూలవిక్రీడితము

సంభ్రాంతిస్తవదేవి! సా విజయతే మానావనమ్రేశివే!

త్వత్పాదాంబురుహప్రహారముదితేమందం సముత్థాయిని .

లాక్షారాగరసారుణంనిపతితం గంగాపయశ్శీకరం

దృష్ట్వాశోణితశంకయా తరలితా కాంతం యదాలంబథాః .. 15..

ప్రతిపదార్థము

దేవి! = ఓ దేవీ!; మాన ఆవనమ్రే = మీ అలుక తీరటానికి సాష్టాంగ నమస్కారం చేసి; మందం = మెల్లగా; సముత్థాయిని = పైకి లేచిన; శివే = శివునియందు; త్వత్ పాద+అంబురుహ = మీ పాద పద్మముల; ప్రహారమ్ = దెబ్బకు; ఉదితే = ఉదయించి; నిపతితం = ఆయన తల నుండి కిందికి జారుచున్న; లాక్షారాగరస అరుణం = మీ పాదాల లక్కరంగు ఎరుపుతో కలిసిపోయిన; గంగాపయస్+శీకరం = గంగాజల బిందువులను; దృష్ట్వా = చూసి; శోణితశంకయా = రక్తపు చుక్కలుగా భ్రమించి; తరలితా = చలించి; కాంతం = మీ ప్రియమైన వారిని; యదా = ఎలా ఎప్పుడు; ఆలంబథాః = ఆలంబముగా తీసుకొని కౌగిలించుకొనే; తవ = నీయొక్క; సంభ్రాంతిః = భయపడుట ఏదైతే ఉన్నదో; సా విజయతే = అది చిరకాలం మా మనస్సులలో జీవించి విజయవంతమగుగాక!

**తాత్పర్యము**

ఓ దేవీ! మీ అలుక తీరటానికి శివుడు సాష్టాంగ నమస్కారం చేసి, ఆపై మెల్లగా పైకి లేచాడు. అప్పుడు శివుని తల నుండి ఎర్రని గంగాజల బిందువులు కిందికి కారటం మీరు గమనించారు. ఒక్క క్షణం – మీ పాదాలకు పూసిన ఎరుపు రంగు లక్కవలన వంగిన శివుని తలపై ఉన్న గంగాజలము ఎరుపుగా మారిందనే విషయం మరిచిపోయారు. మీ పాదపద్మాల దెబ్బకు శివుని తలకు గాయమయి, ఎర్రని రక్తపు చుక్కలు కారుతున్నాయేమోననే భ్రమతో – అతిగా స్పందించినందుకు క్షమాపణ చెప్పే చర్యగా – మీరు మీ ప్రియమైన శ్రీవారిని శివుడిని ఆలింగనం చేసుకున్నారు. ఆ మీరు భయపడుట ఏదైతే ఉన్నదో, ఆ భావన చిరకాలం మా మనస్సులలో జీవించి విజయవంతమగుగాక!

**విశేషం**

శంకరభగవత్పాదులు దేవ్యాపరాధ క్షమాపణ స్తోత్రంలో ఇలా చెప్పారు: జగదంబవిచిత్ర మత్ర కిం పరిపూర్ణా కరుణాస్తి చే న్మయి ! అపరాధపరంపరావృతం న హి మాతా సముపేక్షతే సుతమ్ (11) (అమ్మా జగన్మాతా! నీవు నిలువెల్లా కరుణా మూర్తివి. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. అందుకే కుమారుడనైన నా తప్పులెన్నున్నా, తప్పనిసరిగా నన్ను పక్కన పెట్టకుండా నీ అక్కున చేర్చుకొంటావు కదా!). అమ్మవారి దయ అలాంటిది. "తన భక్తుల పట్ల దేవికి కోపం ఎక్కువ కాలం ఉండదు. ఆమె ఎప్పుడూ కరుణతో నిండి ఉంటుంది. భక్తుని యొక్క పాపాలను క్షమించడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది. మనిషి తన అహాన్ని పక్కనపెట్టి ఆమె పాదాల వద్ద ఆశ్రయం పొందడం కోసం మాత్రమే ఆమె ఎదురుచూస్తుంది." ఈ విషయాన్ని కవితాత్మకంగా వ్యంగ్యంగా భట్టాత్రి పై శ్లోకంలో చెప్పాడు.

---

శార్దూలవిక్రీడితము

**సా పాదద్వితయాహతిర్జయతి తే, యస్యాం గిరీంద్రాత్మజే!**

**ప్రాచీనేందుయుతేనఖేందుదశకే మౌలిస్థలీసంగతే .**

**స్వస్యైకాదశమూర్తితాసముచితానేకాదశైవోడుపా-**

**నాబిభ్రాణఇవాబభౌ స భగవానేకోఽపి రుద్రఃస్వయం .. 16**

**ప్రతిపదార్థము**

గిరి+ఇంద్ర+ఆత్మజే! = పర్వతాలకు అధిపతి అయిన హిమవంతుని కుమారితా!; తే = నీకు; సా = ఆ (శివుని తలకు తాకిన); పాదద్వితయ = పాదముల జంట యొక్క; ఆహతిః = దెబ్బ; జయతి = జయించుచున్నది; యస్యాం మౌలిస్థలీసంగతే = ఏ శివుని తలపై; ప్రాచీన = ఇప్పటికే ఉన్న; ఇందుయుతే = చంద్రునితో; నఖ+ఇందుదశకే = మీ పాదాల గోళ్ళ రూపంలో ఉన్న పది చంద్రులు చేరినప్పుడు; స్వస్య = తనకు తాను; ఏకాదశమూర్తితాసముచితాన = పదకొండు రుద్రుల రూపంలో ఉన్నట్లుగా; సః భగవాన్ = ఆ భగవంతుడయిన శివుడు; ఆబభౌ = ప్రకాశిస్తాడు; రుద్రః = రుద్రుడు; స్వయం = స్వయముగా; ఏకః+అపి = ఒక్కడే అయినప్పటికీ; ఏకాదశ+ఇవ+ఉడుపాన్ = పదకొండు రుద్రుల రూపాలను; ఆబిభ్రాణ = ధరించుచున్నాడు.

**తాత్పర్యము**

పర్వతాలకు అధిపతి అయిన హిమవంతుని కుమారితా! శివుని సాష్టాంగ నమస్కారం సమయంలో మీ పాదాల తాకిడి నిజంగా చాలా అందంగా ఉంది. శివుని తలపై ఇప్పటికే ఉన్న చంద్రునితో, మీ పాదాల గోళ్ళ రూపంలో ఉన్న పది చంద్రులు

చేరినప్పుడు, శివుడు పదకొండు రుద్రుల రూపంలో ఉన్నట్లుగా ప్రకాశిస్తాడు. స్వయముగా శివుడు ఒక్కడే అయినప్పటికీ, నీ పాదముల తాకిడితో పదకొండు రుద్రుల రూపాలను ధరించుచున్నాడు.

విశేషాలు

పదకొండుమంది (ఏకాదశ) రుద్రులు ఎవరనే విషయంలో కొద్ది తేడాలతో అయిదు పట్టికలు ఉన్నాయి:

- మొదటి పట్టిక: 1. వీరభద్రుడు, 2. శర్వుడు, 3. గిరీశుడు, 4. అజైకపాదుడు, 5. అహిర్బుధ్న్యుడు, 6. పినాకి, 7. స్థాణువు, 8. పశుపతి, 9. భవుడు, 10. ఉగ్రుడు, 11. త్విట్పతి/ త్విషాంపతి.
- రెండవ పట్టిక: 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శర్వుడు, 4. మృగవ్యాధుడు, 5. రంతిజుడు, 6. భిక్షకుడు, 7. అహిర్బుధ్న్యుడు, 8. పినాకి, 9. పాదుకేశ్వరుడు, 10. కాపాలికేయుడు, 11. భౌముడు.
- మూడవ పట్టిక: 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శబరుడు, 4. మృగవ్యాధుడు, 5. రంతిజుడు, 6. భిక్షకుడు, 6. అహిర్బుధ్న్యుడు, 7. పినాకి, 8. పాదుకేశ్వరుడు, 9. కాపాలికేయుడు, 10. భౌముడు. 11. అజుడు.
- నాలుగవ పట్టిక: 1. అజుడు, 2. ఏకపాదుడు, 3. అహిర్బుధ్న్యుడు, 4. త్వష్ట, 5. రుద్రుడు, 6. హరుడు, 7. శంభుడు, 8. త్ర్యంబకుడు, 9. అపరాజితుడు, 10. ఈశానుడు, 11. త్రిభువనుడు.
- ఐదవ పట్టిక: 1. అజైకపాత్, 2. అహిర్బుధ్న్యుడు, 3. విరూపాక్షుడు, 4. సురేశ్వరుడు, 5. జయంతుడు, 6. బహురూపుడు, 7. త్రయంబకుడు, 8. అపరాజితుడు, 9. వైవస్వతుడు, 10. సవిత్రుడు, 11. హరుడు.

---

శార్దూలవిక్రీడితము

కింవైరించకరోటికోటినిహతం కిం వా ఫణిగ్రామణీ-

నిశ్వాసానిలఖేదితంత్విదమితి ప్రేమార్ద్రసల్లాపినా .

మానస్యోపశమేకరేణ శనకైరామృద్నతా శంభునా

భూయశ్చుంబితమంబుజద్యుతిపదం ధ్యాయామి మాయే! తవ .. 17..

ప్రతిపదార్థము

మాయే! = ఓ మహామాయా!; తవ మానస్య+ఉపశమే = మీ మానము (స్త్రీలకు పురుషులయెడ కలుగు కోపవిశేషము) శాంతించిన తరువాత; శంభునా = శివునిచేత; కరేణ = తన చేతితో; శనకైః = మెల్లగా; భూయః = మళ్లీ మళ్లీ; అంబుజద్యుతి పదం = పద్మ కాంతులు వెదజల్లు మీ పదములను; ఆమృద్నతా = ఒత్తుతూ; చుంబితమ్ = ముద్దులు పెడుతూ; ప్రేమా+ఆర్ద్రసల్లాపినా = ప్రేమతో తడిసిన (కలిసిన) సంభాషణ ప్రారంభించి; ఇదమ్ +ఇతి = ఇలా నిన్ను అడిగాడు; తవ పదం = మీ పాదాలు; వైరించ = బ్రహ్మ; కరోటికోటినిహతం కిం = పుర్రె యొక్క (పదునైన) మూలాల వల్ల గాయపడ్డాయా?; కిం వా = లేక; ఫణిగ్రామణీ = సర్పరాజయిన ఆదిశేషుని యొక్క; నిశ్వాస+అనిలఖేదితం తు = నిశ్వాసపు విషవాయువుతో కందిపోయాయా?; (అని అడిగాడు); (తవపదం) ధ్యాయామి = నేను నీ పాదాలను ధ్యానిస్తాను.

తాత్పర్యము

ఓ మహామాయా! నీ కోపము శాంతించిన తరువాత, శివుడు తన చేతితో మెల్లగా, ఒత్తుతూ మళ్లీ మళ్లీ పద్మ కాంతులు వెదజల్లు మీ పాదములకు ముద్దులు పెడుతూ ప్రేమతో ఇలా నిన్ను అడిగాడు: "ప్రియురాలా! మీ పాదాలు, బ్రహ్మ పుర్రె యొక్క పదునైన మూలాల వల్ల గాయపడ్డాయా? లేక సర్పరాజయిన ఆదిశేషుని యొక్క నిశ్వాసపు విష వాయువుతో కందిపోయాయా?" శివునిచేత అలా ప్రేమగా పరామర్శింపబడిన నీ పాదాలను నేను ధ్యానిస్తాను.

విశేషాలు

తాను అమ్మవారికి నమస్కరించినప్పుడు తాను ధరించే కపాలము (బ్రహ్మ యొక్క పుర్రె), ఆదిశేషుని వలన పాదాలకు ఏమైనా ఇబ్బందులు వచ్చాయా అని శివుని అందమైన పరామర్శ. జరగనిదానిని జరిగించు శక్తి గలదానిని, మహిమాన్వితమైన మాయాలక్షణం కల అమ్మవారిని మహా మాయా అంటారు (లలితాసహస్రం 215వ నామం).

---

శార్దూలవిక్రీడితము

పూర్వంజహ్నుసుతా సకృన్మురరిపోః శ్రీపాదసంక్షాలనాత్-

పుణ్యాదీదృశవైభవాసమభవత్గోవిందవంద్యే! శివే! .

సేయంసంప్రతి శంభుమౌలినిలయా మానప్రసంగానతౌ

నిత్యంత్వచ్చరణావసేచనభువా పుణ్యేన కీదృగ్భవేత్? .. 18..

ప్రతిపదార్థము

గోవిందవంద్యే! = గోవిందునిచే నమస్కరించబడుదానా!; శివే! = శుభదాయకురాలా!; పూర్వం = పూర్వము; జహ్నుసుతా = గంగాదేవి; సకృత్ = ఒకసారి; మురరిపోః = మురాసురుని శత్రువయిన విష్ణువుయొక్క; శ్రీపాద = కాంతి కలిగిన పాదాలను; సంక్షాలనాత్ = కడిగినప్పుడు లభించిన; పుణ్యాత్ = పుణ్యమువలన; ఈదృశవైభవా = ఇటువంటి అద్భుతమైన వైభవాన్ని (అందరి పాపాలను పోగొట్టే వైభవాన్ని); సమభవత్ = పొందింది.

సా శంభుమౌలినిలయా = అటువంటి శివుని శిరస్సులో ఉండే గంగ; సంప్రతి = ఇప్పుడు; నిత్యం = ప్రతిరోజు; మానప్రసంగానతౌ = నీ అలుకను పోగొట్టటానికి శివుడు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నప్పుడు; త్వత్+ చరణ+ అవసేచనభువా పుణ్యేన = నీ పాదాలను కడిగినప్పుడు లభించిన పుణ్యం వల్ల; ఇయం = ఈ గంగ; కీదృక్ +భవేత్? = ఏ గొప్ప వైభవాన్ని పొందబోతోంది? (ఎంతో వైభవాన్ని పొందుతుందని భావం).

తాత్పర్యము

గోవిందునిచే నమస్కరించబడుదానా! శుభదాయకురాలా! ఒకసారి, గంగ విష్ణువు పాదాలను కడిగిన పుణ్యం వల్ల ఆమె వైభవం పెరిగింది. ఇప్పుడు, నిన్ను శాంతింపజేయడానికి శివుడు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నప్పుడు, శివుని శిరస్సులో ఉండి గంగ నీ పాదాలను ప్రతిరోజూ కడుగుతున్నది. మరి ఈ పుణ్యం వల్ల ఆమె ఏ గొప్ప తేజస్సును పొందబోతోంది? (ఎంతో వైభవాన్ని పొందుతుందని భావం).

విశేషాలు

త్రివిక్రమ అవతార సమయంలో, విష్ణువు తన పాదాన్ని పైకిలేపినప్పుడు, బ్రహ్మ తన కమండలములోని నీటితో అతని పాదాన్ని కడుగుతాడు. అప్పుడు ఆ నీరు గంగగా మారింది. ఈ పుణ్యం వల్లనే గంగ శివుని శిరస్సును అలంకరించే అదృష్టాన్ని పొందింది. ఇప్పుడు, శివుడు సాష్టాంగ నమస్కారం చేస్తున్నప్పుడు శివుని శిరస్సున ఉన్న గంగ అమ్మవారి పాదాలను రోజూ కడిగే అదనపు పుణ్యం కారణంగా, ఆమె మరింత ధన్యమైందని భావం. శ్లోకంలోని గోవిందవంద్యే! (గోవిందునిచే నమస్కరించబడుదానా!) పదప్రయోగము సాభిప్రాయమైనది. అనేక పదాలను చదివాము. అయినా మాకు తృప్తి లేదు. ఎందుకంటే నీ పదమును (= పాదమును) అంటుకోలేదు.

---

శార్దూలవిక్రీడితము

పూర్వంవ్యాకరణప్రపంచనవిధౌ లబ్ధ్వాప్యనేకం పదం
కింనో తృప్తిమగాదగాధిపసుతే! శేషః ఫణిగ్రామణీః .
ఆలీనఃశశిమౌలిమూర్ధని చిరం ప్రేమప్రకోపానతౌ
లబ్ధుంతే పదమేకమేవ కుతుకీ నిత్యం యతో వర్తతే .. 19

ప్రతిపదార్థము

పూర్వం = పూర్వము; వ్యాకరణ = వ్యాకరణముయొక్క; ప్రపంచనవిధౌ = శబ్దవిస్తరము చేయు కార్యక్రమంలో; అనేకంపదం = అనేక పదాలను; లబ్ధ్వా+అపి = పొందినప్పటికీ; నః = మాకు; తృప్తిమ్ అగాత్ కిం = ఏ తృప్తి, పొందలేదు కదా!; అగ+అధిపసుతే! = హిమవంతుని కుమారితా!; యతః = ఎందుకనగా; ఫణిగ్రామణీః = పాములలో గొప్పవాడయిన; శేషః = ఆదిశేషుడు; ఆలీనః = అంటుకొన్నవాడయి; శశిమౌలిమూర్ధని = చంద్రుని కిరీటముగా కలిగిన శివుని; చిరం = చాలా కాలము; ప్రేమప్రకోప+ఆనతౌ = తన మీద మీకు కలిగిన అలుకను తీర్చటానికి నమస్కరించే సందర్భంలో; లబ్ధుం = పొందుటకు; తే = మీయొక్క; ఏకమ్ పదమ్+ ఏవ = ఒక్క పాదాన్నయినా అంటుకోవాలనే; కుతుకీ = కుతూహలము కలవాడయి; నిత్యం = నిత్యము; వర్తతే = వర్తించుచున్నాడు కదా!

తాత్పర్యము

హిమవంతుని కుమారితా! పార్వతీ! మేము వ్యాకరణము యొక్క మహాభాష్యమును చదివే కార్యక్రమంలో, అనేక పదాలను చదివాము. అయినా మాకు తృప్తి లేదు. ఎందుకంటే నీ పదమును (= పాదమును) అంటుకోలేదు. మాకే కాదు.. మహాభాష్యమును పతంజలి రూపంలో వ్రాసిన ఆదిశేషునికి కూడా తృప్తి లేదు. నేను ఆ విషయము ఎలా చెబుతున్నానని అంటున్నావ? తన మీద మీకు కలిగిన అలుకను తీర్చటానికి నమస్కరించే సందర్భంలో శివుడు నమస్కరిస్తుంటాడు కదా! ఆ సందర్భంలో ఆదిశేషుడు శివుని శిరస్సుకు అంటుకొని, నీ యొక్క, ఒక్క పదమయినా (పదము, పాదము) అంటుకోవాలనే కుతూహలముతో కలవాడయి, నిత్యము ప్రయత్నిస్తుంటాడు కదా! (మహాభాష్యమును పతంజలి రూపంలో వ్రాసిన ఆదిశేషునికే తృప్తి లేదు. ఇక మాకు తృప్తి ఎలా కలుగుతుందని చమత్కారము).

విశేషాలు

ఈ శ్లోకంలో కవి నారాయణ భట్టాత్రి 'పద' అనే పదముతో అద్భుతమైన చమత్కారం చేసాడు. పదమనే శబ్దానికి మూడు అర్థాలున్నాయి:

1. (పద్యంతే జానీతే అష్టాధ్యాయే సూత్రార్థమనేన, 'పదం శేషాహికృతం భాష్యమ్') దీనితో అష్టాధ్యాయి సూత్రార్థమును తెలుసుకొందురు. పాతంజల మహాభాష్యము.
2. (పద్యతే) వెళ్లునది. పాదము;
3. వ్యాకరణములో చెప్పబడు పదము.

పై మూడు అర్థాలలో పదశబ్దాన్ని అద్భుతంగా కవి ప్రయోగించాడు. తనకు పాదదాసులయిన వారిని మహాభాష్య వ్యాఖ్యాన కారుడయిన ఆదిశేషుడనే పాన్పు మీదికి ఎక్కించి విష్ణు సమత్వాన్ని అమ్మవారు ఇస్తుందని, మూకపంచశతిలో చెబితే (2-64), భట్టాత్రి ఈ కల్పనకు ఇంకొక పై మెట్టు ఈ శ్లోకంలో వేసాడు.

---

శార్దూలవిక్రీడితము

తిష్ఠంత్యాంప్రణయప్రకోపవశతో బాష్పాకులాక్ష్యాం త్వయి

శ్రీకంఠేనఖదర్పణప్రతిఫలద్రూపే పురోవర్తిని .

పాదాగ్రేపతితోఽయమిత్యభిహితే సఖ్యా, తవాలోకనం

లోలంపాదతలే విభాతి సహసా సాకోపమాలీముఖే .. 20..

ప్రతిపదార్థము

బాష్ప+ఆకుల+అక్ష్యాం = కన్నీళ్లతో నిండిన; ప్రణయ ప్రకోపవశతః = ప్రేమపూర్వక గొడవల తర్వాత; తిష్ఠంత్యాం = మీరు కూర్చున్నప్పుడు; పురోవర్తిని = ఎదురుగా కూర్చున్న; శ్రీకంఠే రూపే = శివుని ప్రతిబింబం; త్వయి నఖదర్పణ = మీ పాదాల గోళ్ళ అద్దంలో; ప్రతిఫలత్ = కనిపిస్తూ; అయమ్ = (ఈ సమయంలో) శివుడు; పాద+అగ్రే పతితః ఇతి = మీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాడని; సఖ్యా = స్నేహితురాలిచేత; అభిహితే = మీరు చెప్పబడగా; సహసా = వెంటనే; లోలం = ఆత్రుతగా; పాదతలే తవ+ఆలోకనం = మీ పాదాలను చూసి; శివుడు సాష్టాంగ నమస్కారం చేయడం లేదని గమనించి; సా అలీముఖే = మీ స్నేహితురాలివైపు; కోపమ్ = (అబద్ధం చెప్పిన) మీరు కోపంతో చూస్తారు; విభాతి = (మీ రూపం ఎప్పుడూ) మెరుస్తూ ఉంటుంది.

తాత్పర్యము

పూజ్యురాలా! కన్నీళ్లతో నిండిన కొన్ని ప్రేమపూర్వక గొడవల తర్వాత మీరు కోపంగా కూర్చున్నప్పుడు, ఎదురుగా కూర్చున్న శివుని ప్రతిబింబం మీ పాదాల గోళ్ల అద్దంలో కనిపిస్తుందని, ఈ సమయంలో, శివుడు మీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాడని మీ స్నేహితురాలు చెప్పింది. ఒక్కసారిగా, మీరు ఆత్రుతగా మీ పాదాలను చూసి, శివుడు సాష్టాంగ నమస్కారం చేయడం లేదని గమనించారు. అప్పుడు మీరు మీ స్నేహితురాలివైపు (అబద్ధం చెప్పిన) కోపంతో చూస్తారు. మీ రూపం ఎప్పుడూ మెరుస్తూ ఉంటుంది.

విశేషాలు

నఖదీధితిసంఛన్ననమజ్జనతమోగుణా (44వ నామం) అను లలితాసహస్రనామము ఇక్కడ స్మరణీయమైనది. తనకు నమస్కరించే జనులయొక్క అజ్ఞానము అను చీకటిని కప్పివేయగలిగిన లేదా పోగొట్టగలిగిన కాలిగోళ్ళ కాంతులు కలది అమ్మవారు. ఈ భావాన్ని కవితాత్మకంగా కవి ఇక్కడ వివరించాడు. "ఇవి తాజాగా వికసించిన ఎర్రటి తామరపువ్వులే" అని తికమకపడతాయి.

శార్దూలవిక్రీడితము

కాంతాలోకనలజ్జయావినమితే కాంతే ముఖాంభోరుహే

యాసాభూతలపాతుకా నయనయోః శోభా తవాభాసతే .

సా తావత్తరుణారుణాంబుజయుగభ్రాంత్యాత్వదంఘ్రిద్వయ-

ప్రాంతేభాతి మరందపానకుతుకభ్రాంతేవ భృంగావలీ .. 21..

ప్రతిపదార్థము

కాంత+ఆలోకన = నీ ప్రియుడు శివుడు చూస్తున్నప్పుడు; లజ్జయా = సిగ్గుపడి; వినమితే = మీరు తలవంచుకొంటారు; కాంతే ముఖ+అంభోరుహే = ఆ తలవంచుకొను సమయంలో కాంతి కలిగిన మీ కమల ముఖంనుండి; యా+ = ఏ; భూతలపాతుకా = నేల మీద పడుతున్న; నయనయోః శోభా = మీ కళ్ల యొక్క కాంతి ఏదయితే ఉన్నదో; అసా = అది; తవ+అభాసతే = మీ యందు ప్రకాశిస్తుంది.

సా = మీ కళ్ల యొక్క కాంతి; తావత్ = మీ రెండు పాదాలను చూడగానే; తరుణ+అరుణ+అంబుజయుగభ్రాంత్యా = తాజాగా వికసించిన ఎర్రటి తామరపువ్వులే అని తికమకపడి; త్వత్+అంఘ్రిద్వయప్రాంతే = మీ పాదాల జంట ఉన్న ప్రాంతంలో; మరందపానకుతుకభ్రాంతా = పువ్వుల్లోని మకరందాన్ని సేవించాలనే ఆశతో; భృంగ+ఆవలీ ఇవ = తుమ్మెదలవలె; భాతి = పారవశ్యం చెందుతూ ప్రకాశిస్తాయి.

తాత్పర్యము

దేవీ! శివుడు నిన్ను చూస్తున్నప్పుడు, మీరు సిగ్గుగా మరియు క్రింది వైపుకి చూస్తారు. ఆ సమయంలో మీ కమల ముఖం నుండి నీ కన్నుల తేజస్సు నేలమీద పడి ప్రకాశిస్తుంది. ఆ తేజస్సు, నీ రెండు పాదాలను చూడగానే, "ఇవి తాజాగా వికసించిన ఎర్రటి తామరపువ్వులే" అని తికమకపడి, పువ్వుల్లోని మకరందాన్ని సేవించాలనే ఆశతో తేనెటీగలు లాగా మీ పాదాల చుట్టూ తిరుగుతూ పారవశ్యం చెందుతాయి.

విశేషాలు

అమ్మవారి కళ్ళు తేనెటీగలు లాంటివి. ఆమె తన పాదాలవైపు చూసినప్పుడు తేనెటీగలు మరో రెండు ఎర్రటి తామరపువ్వులను (పాదాలు) చూసాయని, తాజా తేనె యొక్క మరొక మూలాన్ని ఆ పాదాలు కలిగి ఉన్నాయని సంతోషిస్తాయి. ఈ విధంగా అమ్మవారి పాదాలు పద్మాలుగా, కంటి చూపులు తుమ్మెదల్లా ఆలంకారికంగా అందంగా నిరూపించబడ్డాయి. భక్తుడు అమ్మవారి అనుగ్రహాన్ని కోరుకొని, ఆరు పాదాలతో (అంటే మనస్సు మరియు పంచేంద్రియాలు) తాను తుమ్మెదగా మారి, అమ్మవారి పాదపద్మాలలో నివసించాలనే అద్భుత భావనతో శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో దదానేదీనేభ్యః ------(90) శ్లోకం చెప్పారు. ఇది ఈ సందర్భంలో స్మరణీయం.

---

శార్దూలవిక్రీడితము

కింబ్రూమః కుటిలాత్మకోఽపి కబరీభారస్త్వదీయః శివే!

కేలీవిశ్లథితస్తనోతియదయం త్వత్పాదసంస్పర్శనం .

తత్భూయఃసుమనోగణాదృతగుణస్త్వన్మౌలిసంలాల్యతాం

ధత్తే;చిత్రమసౌ, త్వదంఘ్రిభజనాత్కిం కేన నో లభ్యతే?.. 22..

ప్రతిపదార్థము

శివే! = శుభదాయకురాలా! (భవానీ!); కిం బ్రూమః = ఏమి చెబుతాము?; త్వదీయః కబరీభారః = మీ దట్టమైన జుట్టు; కుటిలాత్మకః+అపి = వంకరగా ఉన్నప్పటికీ; కేలీవిశ్లథితః = క్రీడా సమయంలో శిథిలమై అటునిటు చెదరి; యత్ +అయం = ఏదయితే ఉన్నదో ఆ జుట్టు; త్వత్ +పాదసంస్పర్శనం = మీ శ్రీపాదములను; తనోతి = తాకుతుంది.

తత్ = తరువాత ఆ జుట్టు; భూయః = మరలా; సుమనోగణ+ఆదృతగుణః = పూలతో సమ్మానింపబడు గుణము కలదయి (దేవతలచే ఆరాధించబడు గుణము కలదయి); త్వత్+మౌళి = మీ తల పై; సంలాల్యతాం ధత్తే = అలంకరించబడుతుంది.

అసౌ = ఇది; చిత్రమ్ = చిత్రమైనది; త్వత్+అంఘ్రిభజనాత్ = మీ పాదాలను పూజించడం వల్ల; కిం కేన న లభ్యతే? = ఎవరికయినా లభించని వస్తువు ఉంటుందా? (ఉండదని భావం).

తాత్పర్యము

భవానీ! ఏం చెప్పాలి? మీ దట్టమైన జుట్టు, వంకరగా ఉన్నప్పటికీ, క్రీడా సమయంలో విడిపోయినప్పుడు, మీ శ్రీపాదాలను తాకుతుంది. తరువాత, మీ తలపై, అదే జుట్టు పూలతో అలంకరించబడుతుంది (లేదా దేవతల ద్వారా

ఆరాధించబడుతుంది). ఇది విచిత్రం. మీ పాదాలను పూజించడం వల్ల ఎవరికయినా లభించని వస్తువు ఉంటుందా? (ఉండదని భావం).

విశేషములు

దేవియొక్క శ్రీపాదాలను తాకిన అదృష్టము వలన, జుట్టు, స్వభావరీత్యా వంకరగా ఉన్నప్పటికీ, దేవతలచే పూజింపదగినదిగా మారుతుందని అంతరార్థం. అదేవిధంగా, ఒక భక్తుడు వంకర గుణాలతో ఉన్నప్పటికీ, దేవి యొక్క శ్రీపాదాలను పూజించడం ద్వారా, అతను ఇతరులచే పూజించబడతాడని భావం. ఈ శ్లోకంలో 'సుమనస్' అనే పదం శ్లేషతో పువ్వులతో పాటు దేవతలను కూడా సూచిస్తుంది. "నిన్ను ఆశ్రయించిన వారికి ఇక ఆపదలు కలుగవు; మరోవైపు వారే ఇతరులకు ఆశ్రయం అవుతారని (604) దుర్గా సప్తశతిలో చెప్పిన భావం ఇక్కడ స్మరణీయమైనది." "ఓ తల్లీ! పార్వతీ! వికసించుచున్న నల్లకలువల ఒత్తుగా నున్న తోటవలె ప్రకాశిస్తూ - నల్లదనము, చిక్కదనము, నునుపుదనము, మెత్తదనము గలిగిన నీ కేశపాశములో తురమబడుటకు, స్వర్గలోకములోని కల్పవృక్ష పుష్పములు ఆసక్తిగా ఎదురు చూస్తుంటాయి. అట్టి నీ కేశపాశ దర్శనము మా హృదయములోని అజ్ఞానాంధకారమును తొలగించి, మమ్ము ప్రజ్ఞావంతులుగా చేయుగాక! "అని శంకర భగవత్పాదులవారు సౌందర్యలహరిలో చేసిన అమ్మవారి కేశపాశముల వర్ణన (ధునోతి ధ్వాంతం..43 వ శ్లోకం) కూడా ఇక్కడ అనుసంధానీయమైనది.

---

శార్దూలవిక్రీడితము

రాగద్వేషముఖాహి విభ్రమభరా నశ్యంతి విశ్వేశ్వరి!

త్వత్సంగాదితిముక్తిదేశనిలయే! మిథ్యా జనైః కథ్యతే .

ఉద్యద్ద్వేషముదారవిభ్రమధరంగాత్రం దధత్యా త్వయా

రాగోఽపిధ్రియతేఽధికం చరణయోః శోణాంబుజచ్ఛాయయోః .. 22..

ప్రతిపదార్థము

ముక్తిదేశనిలయే = గురువాయూర్ కి దగ్గరలో ఉన్న ముక్తిదేశ నివాసినీ!; విశ్వ+ఈశ్వరి! = ప్రపంచమునకు అధిపతీ! త్వత్+సంగాత్ = నీతో సహవాసం చేయడంవల్ల; రాగద్వేషముఖా = ఇష్టాలు (రాగం), అయిష్టాలు (ద్వేషం) వంటి; విభ్రమభరాః = భ్రమలు; నశ్యంతి ఇతి = నాశనమవుతాయని; జనైః = ప్రజలచేత; మిథ్యా = అబద్ధము; కథ్యతే = చెప్పబడుచున్నది; హి = కదా!

ఉద్యత్ = ఉదయించుచున్న; ద్వేషమ్ = ద్వేషము కలిగి; ఉదార విభ్రమధరం = భ్రమను ఇతరులకు దానము చేయు (కలిగించే); గాత్రం = శరీరమును; దధత్యా = ధరించిన; త్వయా = నీచేత; రాగః +అపి = ఎరుపు కూడా (అనురాగము కూడా); ధ్రియతే శోణ+అంబుజ+ఛాయయోః = ఎర్రని కమలపు కాంతితో నిండిన; చరణయోః = పాదాలయందు; అధికం = అధికముగా; ధ్రియతే = ధరింపబడుచున్నది.

తాత్పర్యము

గురువాయూర్కి దగ్గరలో ఉన్న ముక్తిదేశ నివాసినీ!, ప్రపంచమునకు అధిపతీ! నీతో సహవాసం చేయడం వల్ల ఇష్టాలు (రాగం), అయిష్టాలు (ద్వేషం) వంటి భ్రమలు నాశనం అవుతాయని ప్రజలు చెబుతున్నారు. ఇది నిజం కాదు. ఎందుకంటే నీ స్వరూపమే భ్రమ కలిగించేది. లోకంలోని పద్మపు ఎరుపుదనాన్ని మీ పాదపద్మం గెలిచింది కనుక అది ద్వేషగుణమును కలిగి ఉంటుంది. అలాగే రాగము కూడా (ఎరుపు, ప్రేమవలన కలిగే బంధం) ఎర్రని కమలపు కాంతితో నిండిన మీ పాదాలయందు

అధికముగా ఉన్నది. ఇలా రాగద్వేషాలు నీ దగ్గరే ఉన్నాయి. నువ్వు రాగద్వేషాలు పోగొడతావని ప్రజలు అబద్ధం చెబుతున్నారు.

విశేషాలు

రాగము మరియు ద్వేషము అనేవి అజ్ఞానానికి (అవిద్యకు) మూలమైన ద్వంద్వములు. అమ్మవారిని సేవిస్తే, ఆమె ద్వారా కలిగే అనుగ్రహం అన్ని ద్వంద్వాలను నాశనం చేసి, అద్వైత పరమానందాన్ని కురిపిస్తుంది. దేవి దయను అందంగా చెప్పటానికి కవి నిందా స్తుతి పద్ధతిలో ఈ శ్లోకము చెప్పాడు. అనగా పైకి నింద, లోపల ప్రశంస. అమ్మవారి దర్శనం భ్రమలను పోగొడుతుందని, అమ్మవారి పాదాలు ఎరుపు రంగుని కలిగి ఉన్నాయని, అవి లోకంలోని పద్మాల కాంతిని మించిపోయినవని ప్రశంస. ఈ భావాన్ని శ్లేష పదాల ఆధారంగా నిందా స్తుతిలో భట్టాత్రి అందంగా చెప్పాడు. మూకపంచశతిలోని పాదారవిందశతకంలో 16 వ శ్లోకం ఇదే నిందా స్తుతి పంథాలో ఉండుట గమనార్హం. ఆ శ్లోక భావమిది: కామాక్షీ! మీ పాదపద్మము ఎప్పుడూ రాగంతో (బంధము, ఎరుపు) ఉంటుంది. లోకంలోని పద్మపు ఎరుపుదనాన్ని మీ పాదపద్మం గెలిచింది కనుక అది ద్వేషగుణమును కూడా కలిగి ఉంటుంది. ఈ రాగద్వేషాలకు తోడుగా పండితుల నెత్తి మీదికెక్కే విపరీతమైన గుణము కూడా (అనగా హింసాగుణము) మీ పాదపద్మము కలిగి ఉన్నది. ఇలాంటి లక్షణాలున్న నీ పాదము మోక్షానికి ఎలా మార్గమును చూపిస్తుంది? బంధము, ద్వేషం మరియు హింస అనే మూడు ప్రాథమిక దుర్గుణాలను కలిగి ఉన్న నువ్వు భక్తులకు జ్ఞానాన్ని, మోక్షాన్ని ఎలా ఇస్తావు? (అమ్మవారి పాదాలు బంధ నాశనం చేస్తాయి కనుక, ప్రజలు నెత్తి మీద పెట్టుకొంటారని ప్రశంస).

---

శార్దూలవిక్రీడితము

దేవి!త్వత్పదసత్పరాగమనిశం మౌలౌ సమాబిభ్రతాం
సాధూనామపరాగతైవభవతీత్యాశ్చర్యమాస్తామిదం
పాదస్తేనఖరప్రభావలసితో జాగర్తి సోఽయం పున-
శ్చిత్రంనామ ఖరప్రభావలసితో దుష్టాసురం పిష్టవాన్ .. 24..

ప్రతిపదార్థము

దేవి! = దేవీ!; త్వత్ = నీయొక్క; పద సత్ పరాగమ్ = పాదాల ధూళిని (పుప్పొడిని); అనిశం = ఎల్లప్పుడు; మౌలౌ సమాబిభ్రతాం = తలపై మోస్తున్న; సాధూనామ్ = సద్గురువులకు; అపరాగతా+ఇవ = కీర్తి కలిగించే నిర్లిప్తత వలె; భవతి = అభివృద్ధి చెందుతుంది; ఇతి+ ఆశ్చర్యమ్ = ఇది ఆశ్చర్యంగా ఉంది; ఇదం పాదః = మీ పాదాలు; తే నఖరప్రభా = గోర్లయొక్క తెల్లని కాంతితో; అవలసితః జాగర్తి = ప్రకటించబడిన కాంతితో మెరుస్తుంటాయి; సః +అయం = అవే పాదాలు; పునః = మళ్ళీ; దుష్ట+అసురం = దుష్ట (మహిష) అసురుడిని; పిష్టవాన్ = నలిపివేయుటతో; ఖరప్రభ+అవలసితః ఆస్తామ్ = వాడియైన ఎర్రని కాంతి ప్రకటిస్తున్నవి; చిత్రం నామ = ఇది చిత్రం కదా!

తాత్పర్యము

దేవీ! మీ శ్రీపాద ధూళిని తమ శిరస్సులపై ఎప్పటికీ వదలని ఆ సాధుపురుషులకు మానసిక మలినాలన్నీ (రాగం, ద్వేషం మొదలైనవి) నశిస్తాయి. (శ్రీపాద ధూళిని తలపై మోస్తున్న సద్గురువులకు, నిర్లిప్తత అభివృద్ధి చెందుతుంది). ఇది అద్భుతం. మళ్ళీ మీ పాదాలు గోర్లు మెరుపుతో తెల్లగా మెరుస్తుంటాయి. అదే పాదాల జంట, ఎర్రగా (కోపంతో) మెరుస్తూ, అసహనమైన శక్తితో లోకాన్ని జయించిన దుష్ట మహిషాసురుని సంహరించింది.

**విశేషాలు**

**నారాయణ భట్టాత్రి వివిధ అర్థాలను ఇచ్చే పదాలతో, శ్లేషలతో, అలంకారాలతో శ్లోకాలను మెరిపిస్తాడు. అదే విధంగా ఈ శ్లోకంలో ''పరాగ-అపరాగ'', 'నఖర-ప్రభావలసితః, ఖర-ప్రభావలసితః'' పదాలను అద్భుతంగా ప్రయోగించాడు. మొదటి జంటలో రెండవ పదానికి ఒక ఆక్షరం చేర్చాడు. (పరాగ, అపరాగ). రెండవ జంటలో మొదటి పదంలోని ఒక అక్షరం తీసివేసి రెండవ సమాసంగా చేసాడు. ('నఖర-ప్రభావలసితః', 'ఖర-ప్రభావలసితః'). 'పరాగ' అనే పదానికి ఒక అర్థం పువ్వుయొక్క పుప్పొడి అనగా ధూళి; 'అపరాగ' కు ఇంకొక అర్థం ''రాగం లేకపోవడాన్ని అంటే నిర్లిప్తతను సూచిస్తుంది. అదేవిధంగా, 'నఖర-ప్రభావలసితః' అనే పదబంధం పాదాలు తెల్లగా మెరిసిపోవడాన్ని మరియు గోళ్ల తెల్లని కాంతిని సూచిస్తుంది; 'ఖర-ప్రభావలసితః' అనేది తట్టుకోలేని కోపంతో ఎర్రగా మెరుస్తున్న పాదాలను సూచిస్తుంది.**

---

**శార్దూలవిక్రీడితము**

**ద్విత్వేనస్థితయోస్త్వదీయపదయోర్ద్వైతంనిరస్య స్ఫుటం**

**కైవల్యప్రతిపాదనేకుశలతా జాతేతి కోఽయం క్రమః ? .**

**కింవా యుక్తిభిరత్ర, ముక్తికరతా వ్యక్తైవ తే పాదయో-**

**ర్ముక్తాఏవ హి విస్ఫురంతి విమలాస్తత్సంగినోఽమీనఖాః .. 25..**

**ప్రతిపదార్థము**

**ద్విత్వేనస్థితయోః = రెండుగా ఉన్న (ద్వైతంగా ఉన్న); త్వదీయపదయోః = మీ రెండు పాదములు; ద్వైతం = ద్వైతమును; నిరస్య = నిరసించి; స్ఫుటం = స్పష్టంగా; కైవల్యప్రతిపాదనే = ద్వంద్వ రహిత స్థితి (అద్వైతం)ని; కుశలతా జాతా ఇతి = వెలుగులోకి తీసుకురావడంలో నిష్ణాతులయ్యాయను విషయం; అయం క్రమః కః = ఈ క్రమము ఎలా సముచితం?**

**అత్ర = అయితే ఈ విషయంలో; కింవా యుక్తిభిః = ఈ వాదనలు ఎందుకు?**

**ముక్తికరతా = ఒకటిగా చేసే ముక్తి (విముక్తి) అందించడానికి; తే పాదయోః = మీ రెండు పాదాల సామర్థ్యం; వ్యక్తా+ఇవ = సిద్ధంగా ఉన్నట్లు తెలుపడానికి; అమీ నఖాః = మీ పాదాల గోళ్లు; విమలాః = తెల్లగా మరియు మచ్చలేనివిగా ఉండి; తత్+సంగినః = మీ పాదాలతో అనుబంధం ద్వారా; ముక్తా ఏవ = ముక్తుల (ముత్యాల) వలె; విస్ఫురంతి హి = ప్రకాశిస్తాయి కదా.**

**తాత్పర్యము**

**రెండుగా ఉన్న (ద్వైతంగా ఉన్న) మీ రెండు పాదములు ద్వైతమును నిరసించి స్పష్టంగా, ద్వంద్వ రహిత స్థితి (అద్వైతం)ని, వెలుగులోకి తీసుకురావడంలో ప్రసిద్ధి కలవి. ఇది ఎలా సముచితం? అయితే ఈ విషయంలో, ఈ వాదనలు ఎందుకు? (అనవసరమని భావం). ఒకటిగా చేసే ముక్తి (విముక్తి) అందించడానికి, మీ రెండు పాదాల సామర్థ్యం సిద్ధంగా ఉన్నట్లు తెలుపడానికి, మీ పాదాల గోళ్లు, తెల్లగా మరియు మచ్చలేనివిగా ఉండి, మీ పాదాలతో అనుబంధం ద్వారా, ముక్తుల (ముత్యాల) వలె, ప్రకాశిస్తాయి.**

**విశేషాలు**

**ముక్త అనగా ముత్యము, మోక్షమును పొందినవాడు అను రెండు అర్థాలున్నాయి. కవి ఈ రెండు అర్థాలు కలిగిన పదాన్ని ఈ శ్లోకంలో సముచితంగా ప్రయోగించాడు. అమ్మవారి పాదాల గోళ్లు ముక్త కాంతితో — (అనగా ముక్తుల కాంతితో, ముత్యాల కాంతితో) ప్రకాశిస్తాయని భావం. లలితాసహస్రనామంలో ఇలా చెప్పారు: నఖదీధితిసంఛన్ననమజ్జనతమోగుణా**

(**49** వ నామం). ''దేవీ! నీ గోళ్లలోని ప్రకాశించే తేజస్సుతో, నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసే నీ భక్తునియొక్క గొప్పదయిన అంతర్గత అంధకారాన్ని నీవు తొలగిస్తావు.'' ఈ లలితా సహస్ర నామ భావం మరింత ముక్త తేజస్సును భట్టాత్రి యొక్క ఈ 25వ శ్లోకంలో పొందింది.

---

శార్దూలవిక్రీడితము

పాదాగ్రంతవ కామదం సురలతాశాఖాగ్రమాచక్ష్మహే

జాతాయత్ర హి బాలపల్లవరుచిః స్వైరేవరాగోదయైః .

ఉత్సర్పన్నఖమండలీసుషమయాపుష్పాలిరుత్పాదితా

సంజాతాలిరుతిశ్చమంజులతరైర్మంజీరశింజారవైః

.. **26**..

ప్రతిపదార్థము

తవ పాద+అగ్రం = మీ పాదముల యొక్క చివరను; కామదం = కోరికలను నెరవేర్చే; సుర లతా శాఖ+అగ్రమ్ = కల్పవృక్షపు కొమ్మయొక్క చివరి భాగముగా; ఆచక్ష్మహే = భావిస్తున్నాము.

యత్ర = ఎక్కడ (మీ పాదములో); బాలపల్లవరుచిః = లేత రెమ్మలలో కనిపించే ఎరుపు రంగు; స్వైః +ఏవ = సహజంగా; రాగ+ఉదయైః = రాగోదయముతో; జాతా = ఉంటుంది; హి = కదా!

ఉత్+సర్పత్ = పైకి ఉబికిన; సుషమయా = అధిక కాంతితో; నఖమండలీ = పాదాలలోని గోళ్ల వరుస; పుష్ప+అలిః = పువ్వుల వరుసను; ఉత్పాదితా = కలిగింపబడినది.

మంజులతరైః = మధురాతి మధురమైన; మంజీర = నూపురములయొక్క అందెలయొక్క; శింజారవైః = అవ్యక్త మధురధ్వనులతో; సంజాత అలిరుతిః+చ = పుట్టిన తేనెటీగల రొద కలిగినది.

తాత్పర్యము

భవానీ! మీ పాదము యొక్క చివరను కోరికలను నెరవేర్చే కల్పవృక్షపు కొమ్మయొక్క చివరి భాగముగా మేము భావిస్తున్నాము. కల్పవృక్షపు లేత రెమ్మలలో కనిపించే ఎరుపు రంగు సహజంగానే మీ పాదాలలో ఉంటుంది. కల్పవృక్షపు పువ్వులవలె పాదాలలోని అద్భుతమైన గోళ్ల వరుస అధికమైన కాంతితో మెరుస్తుంటాయి. కల్పవృక్షపు పువ్వులపై తుమ్మెదలు వ్రాలి రొద చేస్తున్నట్లుగా, మీ కాలి అందెల ధ్వని తేనెటీగల రొదలా మమ్మలిని ఆనందింపచేస్తున్నది.

విశేషాలు

అమ్మవారి పాదాలు కోరిన కోరికలు నెరవేర్చే కల్పవృక్షపు కొమ్మలుగా కవి చెబుతూ, కల్పవృక్ష భాగాలను ఆమె పాదాలతో అందంగా పోల్చాడు. ఈ సందర్భంలో శంకర భగవత్పాదుల సౌందర్యలహరిలోని ఈ 89వ శ్లోక భావం స్మరణీయమైనది: ''అమ్మా! జగజ్జననీ! సకల సంపదలతో తులతూగే దేవతల కోరికలను మాత్రమే తమ చిగురుటాకులు అను హస్తములు చేత కల్ప వృక్షములు నెరవేరుస్తుంటాయి. కాని దీన దరిద్ర జనులకు శుభప్రదమైన అధిక సిరిసంపదలను ఎప్పటికప్పుడు, వెంట వెంటనే అనుగ్రహించే నీ పాదాలు - గోళ్ళు అను చంద్రుల చేత - శచీదేవి మొదలైన దేవతా స్త్రీల యొక్క చేతులనే పద్మములను ముకుళింప చేసి — పరిహసిస్తున్నట్లు ఉన్నాయి.'' (నఖైర్నాకస్త్రీణాం).

---

శార్దూలవిక్రీడితము

దేవీయంతవ సన్నతేశమకుటస్వర్లోకకల్లోలినీ-
కల్లోలాహతిభిర్విశేషవిమలాజీయాన్నఖశ్రేణికా .
యద్ధావల్యమవాప్తుమాత్తకుతుకాస్తోయేతపస్యంత్యమీ
దీనాఃఫేనకణాశ్చ మౌక్తికగణాః శంఖాశ్చ శంకామహే .. 27..

ప్రతిపదార్థము

దేవీ = దేవీ!; తవ సన్నత = మీ అలుక తీర్చటానికి మీ శ్రీపాదానికి సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు; ఈశమకుట = శివుని తలపై ఉన్న; స్వర్లోకకల్లోలినీ = గంగా నది యొక్క; కల్లోల+ఆహతిభిః = అలల తాకిడితో; ఇయం = మీ పాదములలోని గోళ్ల వరుస; విశేష విమలా = ప్రత్యేకంగా తెల్లగా మెరుస్తుంది.

నఖశ్రేణికా = అటువంటి గోళ్ల వరుస; జీయాత్ = మా హృదయంలో జీవించి మా బాధలను జయించుగాక!

యత్+ధావల్యమ్ +అవాప్తుమ్ = ఏదయితే తెల్లగా మెరుస్తున్నాయో ఆ మీ గోళ్లయొక్క తెల్లదనం పొందుటకు; ఆత్తకుతుకాః = పొందిన కుతూహలంతో; అమీ దీనాః ఫేనకణాః = గంగా నది నీళ్ళలో ఉన్న చేపలు, నురుగు బుడగలు; చ = మరియు; మౌక్తికగణాః = ముత్యాలు; శంఖాః+చ = శంఖాలు కూడా; తోయే = నీటిలో; తపస్యంతి = తపస్సు చేస్తున్నాయోమో అని; శంకామహే = మేము అనుమానిస్తున్నాము.

తాత్పర్యము

దేవీ! శివుడు మీ అలుక తీర్చటానికి మీ శ్రీపాదానికి సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు, శివుని తలపై ఉన్న గంగానది యొక్క అలలు, మీ పాదాలను తాకిన కారణంగా మీ గోళ్ల వరుస ప్రత్యేకంగా తెల్లగా మెరుస్తున్నది. అటువంటి గోళ్ల వరుస మా హృదయంలో జీవించి మా బాధలను జయించుగాక! గంగా నది నీళ్ళలో ఉన్న చేపలు, నురుగు బుడగలు, ముత్యాలు, శంఖాలు మెరుస్తున్న మీ గోళ్ల యొక్క తెల్లదనం పొందాలనే కోరికతో తపస్సు చేస్తున్నాయోమో అని మేము అనుమానిస్తున్నాము.

విశేషాలు

అమ్మవారి గోళ్ళు తెల్లగా మెరుస్తుంటాయని చెప్పటానికి కవి చేసిన అందమైన ఊహ ఇది.

---

శార్దూలవిక్రీడితము

మానేశంభుశిరఃప్రహారచరితం నైవ త్వదిచ్ఛాకృతం
జానేదేవి! పదాబ్జయోస్తు పురజిన్మూర్ధ్నా విరోధాదిదం .
ఏతేపాదనఖాంశుబద్ధకలహాః శీతాంశుమందాకినీ-
భోగీంద్రాఃకిల శంకరస్య శిరసా శంకాం వినా రక్షితాః .. 28..

ప్రతిపదార్థము

దేవి! = ప్రకాశించుదానా! పార్వతీదేవీ!; శంభుశిరః ప్రహారచరితం = సాష్టాంగ నమస్కారం సమయంలో శివుని తలపై మీ పాదాలు తన్నిన చరిత్ర; త్వత్+ఇచ్ఛాకృతం = మీ ఇష్టపూర్వకంగా; న+ఏవ = జరిగినది కాదని; మానే = భావిస్తున్నాను.

పురజిత్+మూర్ధ్నా = మూడు నగరాలను జయించిన శివునితో; పద+అబ్జయోః తు = మీ పాద పద్మములకు ఉన్న; విరోధాత్ = విరోధము కారణముగా; ఇదం = ఇలా జరిగింది.

ఏతే పాదనఖ+అంశుబద్ధకలహాః = నీ పాదాల గోళ్ల కిరణాల తేజస్సు భరించలేక తగాదాపడిన; శీత+అంశు మందాకినీ-భోగి+ఇంద్రాః = చంద్రుడు, గంగ మరియు ఆదిశేషుడు; శంకరస్య శిరసా = శివుని శిరస్సు పై; శంకాం వినా = ఎటువంటి సందేహం లేకుండా; రక్షితాః = రక్షించబడుతున్నాయని; జానే కిల = తెలుసుకొంటున్నాను కదా!

తాత్పర్యము

దేవీ! ప్రేమ కలహాల సమయంలో సాష్టాంగ నమస్కారం సమయంలో శివుని తలపై మీ పాదాలు ఒక తన్ను తన్నాయి. ఈ దాడి మీ కోరిక మేరకు జరిగినది కాదని నేను భావిస్తున్నాను. మూడు నగరాలను జయించే శివునితో మీ పాద పద్మాల శత్రుత్వం కారణంగా ఇది జరిగింది. కారణం ఏమిటంటే: మీ పాదాల గోళ్ల కిరణాల తేజస్సు భరించలేక ఆ తేజస్సుతో చంద్రుడు, గంగ మరియు ఆదిశేషుడు తగాదాపడి, ఆ మూడు శివుని శిరస్సుపై కొలువు తీరాయి. సమయం దొరికింది కదా అని మీ పాదాలు - సాష్టాంగ నమస్కారం చేసే సమయంలో శివుని తలపై ఉన్న ఆ ముగ్గురు శత్రువులపై తన్ను ద్వారా ప్రతీకారం తీర్చుకొన్నాయి.

విశేషాలు

చంద్రుడు, గంగ మరియు ఆదిశేషుడు - ఈ మూడింటి తేజస్సుకంటే అమ్మవారి పాదాల గోర్లు తేజస్సు కలవని భావం.

---

శార్దూలవిక్రీడితము

దేవి!త్వచ్చరణోచ్చలన్నఖఘృణిశ్రేణీషులీనో నమ-

న్నాభాతిస్ఫటికాచలస్ఫుటతటీశాయీవసోయంనటః .

హంసాలీనఇవ స్వయం కమలభూః క్షీరాబ్ధిశాయీవ చ

శ్రీభర్తామఘవాపి నాకసరితి స్నాయన్నివాలోక్యతే .. 29..

ప్రతిపదార్థము

దేవి! = పార్వతీదేవి!; సః +అయం నటః = ఆ నటరాజయిన పరమశివుడు; త్వత్ +చరణ + నమన్ = నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ; ఉచ్చలత్ = పైకి ఎగురుతున్నట్లున్న; నఖఘృణిశ్రేణీషు = నీ కాలి వేళ్ల గోళ్ల తేజస్సులో; లీనః = కలిసిపోయి; స్ఫటికాచలస్ఫుటతటీశాయీ+ఇవ = తెల్లని దేదీప్యమానమైన కైలాస పర్వతంపై పడుకొని ఉన్నవానివలె; ఆభాతి = ప్రకాశిస్తున్నాడు.

స్వయం = స్వయముగా; కమలభూః = బ్రహ్మ; హంసా+ఆలీన ఇవ = తెల్లని హంసతో కూడుకొని ఉన్నవాలె (ఆభాతి = ప్రకాశిస్తున్నాడు).

శ్రీభర్తా = లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు; క్షీరాబ్ధిశాయీ+ఇవ చ = పాల సముద్రంలో పడుకొని ఉన్నవానివలె (ఆభాతి = ప్రకాశిస్తున్నాడు).

మఘవా+అపి = ఇంద్రుడు కూడా; నాకసరితి = స్వర్గలోకంలోని మానస సరోవరంలో; స్నాయన్+ఇవ = స్నానం చేసినవానివలె; ఆలోక్యతే = చూడబడుచున్నాడు.

తాత్పర్యము

దేవీ! నటరాజయిన పరమశివుడు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ, నీ కాలి వేళ్ల గోళ్ల తేజస్సులో కలిసిపోయి, తెల్లని దేదీప్యమానమైన కైలాస పర్వతంపై ఉన్నవానివలె ప్రకాశిస్తున్నాడు. అదేవిధంగా, బ్రహ్మ నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ, నీ కాలి వేళ్ల గోళ్ల తేజస్సులో కలిసిపోయి తన వాహనమయిన తెల్లని హంసపై కూర్చున్నట్లుగా

ప్రకాశిస్తాడు; లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ, నీ కాలి వేళ్ల గోళ్ల తేజస్సులో కలిసిపోయి తెల్లని పాల సముద్రంలో పడుకొని ఉన్నవానివలె ప్రకాశిస్తాడు; ఇంద్రుడు నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ, నీ కాలి వేళ్ల గోళ్ల తేజస్సులో కలిసిపోయి స్వర్గలోకంలోని తెల్లని మానస సరోవరంలో స్నానం చేసినట్లుగా ప్రకాశిస్తాడు.

విశేషాలు

అమ్మవారి పాదాల గోర్లు తెల్లని తేజస్సుతో ప్రకాశిస్తుంటాయని భావం. అతిశయోక్తి అలంకారం.

---

శార్దూలవిక్రీడితము

డోలాకేలివిధౌహిమాచలశిలాదేశే సమభ్యాహతాత్-

పాదాగ్రాత్తవయాని యావకరసప్రస్యందనాన్యంబికే! .

తాన్యభ్యాగతసుంభసంగరభవద్రక్తాంబువిస్తారణా-

బిందుక్షేపనిభానినందదమరీవంద్యాని వందామహే .. 30

ప్రతిపదార్థము

అంబికే! = తల్లీ! పార్వతీ!; డోలాకేలివిధౌ = ఊయల మీద ఊగుతున్నప్పుడు; హిమాచలశిలాదేశే = హిమాలయాలలోని పర్వతాలలోని కఠినమైన శిలలను; సమ+అభి+ఆహతాత్ = గట్టిగా తాకుటవలన; తవ = మీ యొక్క; పాద+అగ్రాత్ = పాదాల చివర నుండి; యాని = ఏవయితే; యావకరస ప్రస్యందనాని = రాళ్ళపై పడి కారుతున్న ఎర్రటి లక్క కణాలను; తాని = వాటిని; అభి+ఆగత = మీకు ఎదురుగా వచ్చిన; సుంభ = శుంభుడను రాక్షసునితో జరిగిన; సంగర = యుద్ధమందు; భవత్+రక్త+అంబువిస్తారణా = భారీ రక్త ప్రవాహానికి సంబంధించిన; బిందు క్షేప నిభాని = అంశముల పూతకు పోలికలుగా కలిగినవని; నందత్ అమరీ = సంతోషించిన దేవతలు; వంద్యాని = పూజిస్తారు; వందామహే = అటువంటి ఎర్రని ధూళిని మేము కూడా పూజిస్తాం.

తాత్పర్యము

తల్లీ! పార్వతీ! మీరు హిమాలయాలలో ఊయల మీద ఊగుతున్నప్పుడు, మీ శ్రీపాదాలు పర్వతాలలోని కఠినమైన శిలలను తాకాయి. అప్పుడు మీ పాదాలకు పూసుకొన్న ఎర్రటి లక్క కణాల రసాలు కొన్ని ఆ హిమాలయాలలోని రాళ్ళపై పడ్డాయి. స్వర్గం నుండి వచ్చిన స్త్రీలు ఈ ఎర్రటి లక్క కణాలతో ఉన్న హిమాలయ శిలలను - మీతో పూర్వం రాక్షసుడైన శుంభునికి జరిగిన యుద్ధంలో అతని భారీ రక్త ప్రవాహానికి సంబంధించిన అంశములుగా భావించి - మీ పరాక్రమాన్ని ఆ రాళ్ళలో కనుగొంటూ పూజిస్తారు. మేము కూడా ఆ హిమాలయాలలోని మీ పరాక్రమ చిహ్నాలయిన ఆ ఎర్రని శిలలను పూజిస్తాం.

విశేషాలు

"శుంభ", "నిశుంభ" అనే రాక్షస రాజులు దేవతల రాజధాని అయిన స్వర్గాన్ని ఆక్రమించారు. ఇంద్రుడిని, దేవతలను స్వర్గం నుండి వెళ్లగొడతారు. దేవతల ప్రార్థనలను విన్న పార్వతి వారి రక్షణార్థం చండిగా అవతరించింది. ఆమె సౌందర్యానికి మోహించిన శుంభుడు ఆమెను వివాహమాడాలని కోరుకుంటాడు. ఆమె వ్యతిరేకిస్తుంది. ఆమె తిరస్కారాన్ని ఆగ్రహించిన శుంభుడు రాక్షస సేనాధిపతులైన "చండ", "ముండ" లను ఆమెను హతమార్చుటకు పంపిస్తాడు. వారు ఆమె కోపంనుండి పుట్టిన చాముండి ద్వారా చనిపోతారు. శుంభ, నిశుంభులు కలసి చండికను హతమార్చాలని ప్రయత్నిస్తారు కాని ఆమె చేతిలో మరణిస్తారు. వారిని వధించిన తర్వాత చండిక కొంతసేపు ఉత్తరాఖండ్ రాష్ట్రంలోని హరిద్వార్ దగ్గర కల నీల్

పర్వతంపై విశ్రమించినట్లు పురాణ కథనం. అందువలన ఆ ప్రదేశంలో చండీ దేవాలయాన్ని నిర్మించారు. ఈ ప్రాంతంలో గల రెండు పర్వత శిఖరాల పేర్లను "శుంభ", "నిశుంభులుగా" ఇప్పటికీ పిలుస్తుంటారు. భట్టాత్రి నీలపర్వతమనకుండా హిమలయ పర్వతమని తన శ్లోకంలో పేర్కొన్నాడు.

---

శార్దూలవిక్రీడితము

డోలాకేలిషుయం హిమాచలశిలాలగ్నం వనేవాసినో

భక్త్యాయోగివరాస్త్రిపుణ్డకలితేలిమ్పన్తి ఫాలాన్తరే ।

యం సిద్ధప్రమదాః సమేత్య తిలకం కుర్వన్తి నత్వా ముహు-

స్తందాక్షాయణి! తే కదా నుపదయోరీక్షేయ లాక్షారసమ్ ?31

ప్రతిపదార్థము

దాక్షాయణి! = ఓ దక్షుని పుత్రీ! (పార్వతీ)!; డోలా కేలిషు = మీరు ఉయ్యాల ఆటలు ఆడుతున్నప్పుడు; హిమాచల శిలాలగ్నం = హిమాలయాల రాళ్లపై నిక్షిప్తమయిన; యం = ఏ మీ పాదాలకు సంబంధించిన లక్కరసము ఉన్నదో; తం = దానిని; వనేవాసినః = హిమాలయపు అరణ్యాలలో నివసించే; యోగివరాః = గొప్ప యోగులు; భక్త్యా = భక్తితో; త్రిపుండ్రకలితే = మూడు విభూతి పంక్తులతో అలంకరించబడిన; ఫాల+అంతరే = నుదుటిపై; లింపంతి = పూసుకొంటారు.

ముహుః = మరలా; యం = ఏ లక్కరసమున్నదో దానిని; సిద్ధప్రమదాః = సిద్ధుల భార్యలు; సమేత్య = వచ్చి; నత్వా = సాష్టాంగ నమస్కారం చేసి; తిలకం కుర్వంతి = బొట్టుగా పెట్టుకొంటారు.

తే పదయోః = మీ పాదాలపై ఉన్న; లాక్షారసం = ఎర్రని లక్కరసమును; కదా ను = ఎప్పుడు; ఈక్షేయ = చూస్తాను?

తాత్పర్యము

ఓ దక్షుని పుత్రీ! (పార్వతీ)! హిమాలయాలలో మీరు ఉయ్యాల ఆటలు ఆడుతున్నప్పుడు, మీ పాదాలకు సంబంధించిన ఎర్రటి లక్కరసము హిమాలయాల రాళ్లపై నిక్షిప్తమవుతుంది. అరణ్యంలో నివసించే గొప్ప యోగులు తమ మూడు విభూతి పంక్తులతో అలంకరించబడిన తమ నుదుటిపై ఈ ఎర్రని లక్కను భక్తితో పూసుకొంటారు. సిద్ధుల భార్యలు సాష్టాంగ నమస్కారం చేసి, మీ పాదాలకు సంబంధించిన ఎర్రటి లక్కరసమును తమ నుదుటిపై బొట్టుగా పెట్టుకొంటారు. అటువంటి మీ పాదాలకు సంబంధించిన ఎర్రని లక్కరసమును ఎప్పుడు చూస్తాను? (ఆ అదృష్టం కలిగించమని కవి ప్రార్థన).

విశేషాలు

వికల్పము; అనునయము; ప్రశ్న; కారణము; వితర్కము; అవమానము; ఉపదేశము; నిశ్చయము లందు ‘‘ను’’ అను అవ్యయమును కవులు ప్రయోగిస్తుంటారు.

---

శార్దూలవిక్రీడితము

దేవి!త్వం మురవైరిణః ప్రణమనే యత్కించిదాకుంచయ

శ్రీపాదాంబూజమన్యథాస్యశిరసి త్వత్పాదలాక్షాంచితే .

శ్రీభూమ్యోరితరప్రణామకృతమిత్యన్యోన్యమాశంకయా

రోషవ్యాకులయోశ్చిరంస భగవాన్ జాయేత పర్యాకులః .. 32..

ప్రతిపదార్థము

దేవి! = పార్వతీదేవి; త్వం = నువ్వు; మురవైరిణః = మురుడిని సంహరించిన విష్ణువు; ప్రణామనే = నీ పాదాలకు నమస్కరించినప్పుడు; యత్+కించిత్ = ఎంత వీలయితే అంతగా; శ్రీపాద+అంబుజమ్ = నీ పాద కమలమును; ఆకుంచయ = అతనికి అంటుకోకుండా, లోపలకు ముడువు (కుదించు).

అన్యథా = లేకపోతే, మరియొక విధముగా; అస్య శిరసి = ఆ విష్ణువు తలపై అంటుకొన్న; త్వత్+పాదలాక్ష+అంచితే = మీ పాదాలపైని ఎర్రటి లక్కరసపు గుర్తు (పరిణమించవచ్చు).

శ్రీభూమ్యోః = ఎందుకంటే అతని ఇద్దరి భార్యలైన లక్ష్మీదేవి, భూదేవులు; ఇతర ప్రణామకృతమ్ = ఇతర నాయికకు పాద నమస్కారము చేసిన సందర్భంలో విష్ణువు తలపై అంటుకొన్న ఎర్రటి లక్కరసపు గుర్తు ఇది; ఇతి = అని; అన్యోన్యమ్ = పరస్పరము; ఆశంకయా = సందేహముపడుటతో; రోషవ్యాకులయోః = రోషము చేత కలత పడుటచేత (ఆ ఇద్దరి భార్యల అలుక వలన); చిరం = చాలాకాలము; సః భగవాన్ = ఆ భగవంతుడయిన విష్ణువు; పర్యాకులః = (అత్యంతం ఆకులః ఉద్విగ్నః మలినం చ) తొట్రుపాటు కలవాడుగా; జాయేత = కావాలసి వస్తుంది.

తాత్పర్యము

పార్వతీదేవీ! నువ్వు మురుడిని సంహరించిన ఆ విష్ణువు నీ పాదాలకు నమస్కరించినప్పుడు ఎంత వీలయితే అంతగా నీ పాద కమలమును అతనికి అంటుకోకుండా లోపలకు ముడువు (కుదించు). లేకపోతే, మరియొక విధముగా, ఆ విష్ణువు తలపై అంటుకొన్న, మీ పాదాలపైని ఎర్రటి లక్కరసపు గుర్తు తగాదాలకు దారి తీయ వచ్చు. ఎందుకంటే అతని ఇద్దరి భార్యలైన లక్ష్మీదేవి, భూదేవులు, ఇతర నాయికకు పాద నమస్కారము చేసిన సందర్భంలో విష్ణువు తలపై అంటుకొన్న ఎర్రటి లక్కరసపు గుర్తు ఇది అని పరస్పరము సందేహముపడి, రోషము చేత కలత పడి ఆ ఇద్దరి భార్యలు విష్ణువుపై అలుక వహిస్తారు. అందువలన చాలాకాలము ఆ భగవంతుడయిన విష్ణువు చాలాకాలము బాధపడవలసి వస్తుంది.

విశేషాలు

''లక్ష్మికి విష్ణువు నమస్కారము చేసినప్పుడు అతని తలకు అంటుకొన్న ఎర్రటి లక్కరసపు గుర్తు ఇది'' అని భూదేవి, ''భూదేవికి విష్ణువు నమస్కారము చేసినప్పుడు అతని తలకు అంటుకొన్న ఎర్రటి లక్కరసపు గుర్తు ఇది'' అని లక్ష్మీదేవి పరస్పరము అనుమానపడతారని, అందువలన వారికి రోషము కలిగి విష్ణువును ఇబ్బంది పెడతారని భట్టాత్రి ఈ శ్లోకంలో హాస్యం ప్రదర్శించాడు.

శార్దూలవిక్రీడితము

ప్రాగుద్వాహవిధౌ హిమాచలసదస్యశ్మాధిరోపాయయ-
న్నస్ప్రక్ష్యామి వియద్ధునీమితి పునః సత్యం విధాతుం చ యత్ .
దైత్యోత్క్షేపణసాహసే విరచితే సంవాహనార్థం చ యత్-
తత్పాదగ్రహణత్రయం విజయతే శర్వేణ శర్వాణి! తే .. 33..

---

ప్రతి పదార్థము

శర్వాణి! = (శర్వస్య శివస్య పత్నీ) శివుని పత్నీ!, పార్వతీ!, ప్రాక్ = పూర్వము, హిమాచలసదసి = హిమాలయపు వివాహ మందిరంలో, యత్ ఉద్వాహవిధౌ = వివాహ వేడుకలో, అశ్మ+అధిరోపాయ = ఆమె పాదాన్ని రాతిపైకి ఎక్కించి 'అశ్మారోహణ మంత్రం' చెప్పించిన సమయంలోను, వియద్ధునీమ్ = ఆకాశగంగను (తన తలపై ఉన్న స్త్రీని), న స్ప్రక్ష్యామి = తాకనని, పునః = మరలా, యత్ సత్యం విధాతుం చ = గంభీరంగా వాగ్దానం చేసిన సమయంలోను, దైత్య+ఉత్క్షేపణ

సాహసే = మహిషాసురుని తలను అణచిన సాహస సందర్భంలో, యత్ విరచితే సంవాహనార్థం చ = నొప్పి పుట్టిన నీ పాదాలను పిసికే సమయంలోనూ, శర్వేణ = శివునిచేత, తత్ పాదగ్రహణత్రయం = నీ పాదాలను పట్టుకున్న ఈ మూడు సందర్భాలు, తే = నీకు, విజయతే = విజయం సాధించాయి.

---

తాత్పర్యము

పార్వతీ! గతంలో, మొదటిసారి హిమాలయపు వివాహ మందిరంలో జరిగిన వివాహ వేడుకలో, శివుడు 'అశ్మారోహణం' చేసే సమయంలో నీ పాదాలను తాకాడు. ఆకాశగంగను (అతని తలపై ఉన్న స్త్రీని) తాకనని గంభీరంగా వాగ్దానం చేసే సమయంలో అతను రెండవసారి నీ పాదాలను పట్టుకొన్నాడు. మహిషాసుర సంహారం చేసిన నీ పాదాలకు విశ్రాంతి కల్పించటానికి వాటిని ఒత్తే సమయంలో మూడవసారి అతను నీ పాదాలను తాకాడు. నీ పాదాలను శివుడు పట్టుకున్న ఈ మూడు సందర్భాలు నీకు విజయం సాధించాయి.

---

విశేషములు

వివాహ సమయంలో వరుడు వధువు చేత, ఆమె పాదాన్ని రాతిపైకి ఎక్కించి 'అశ్మారోహణ మంత్రం' ఇలా చెబుతాడు:

ఆతిష్ఠేమమశ్మాన మశ్మేవ త్వగ్ స్థిరో భవ |

అభితిష్ఠపృతన్యత స్సహస్వ పృతనాయతః ||

ఇమం = ఈ, అశ్మానం = రాతిని, ఆతిష్ఠ = ఎక్కు మా. త్వం = నీవు, అశ్మేవ = రాయి వలెనే, స్థిరః = చిరకాలజీవిగా, భవ = అగుము. యతః = ఏ హేతువు వలన, పృతనాః = స్నేహితులు; పృతన్యతః = యుద్ధము చేయ కోరిక గల వారిలో ఆ హేతువు వలన సేనలను, అభితిష్ఠ = ఎదుర్కొనుము, సహస్వ = జయింపుము.

తాత్పర్యము:

నీవు ఈ రాతిపై నీ పాదాన్ని పెట్టు. ఈ రాయి వలెనే చిరకాలము నువ్వు జీవించు. నీపై యుద్ధము చేయాలనే కోరికతో వచ్చిన కష్టాలనే సైన్యాలను ఎదుర్కొని ఆ సైన్యాలను మన భావి జీవితంలో జయించు.

ఈ అశ్మారోహణ సందర్భాన్ని భట్టాత్రి తన కవిత్వంలో చమత్కారంగా ఉపయోగించుకొన్నాడు.

''పసుపు నూరుకొను పాత్రమునకు ఆధారమైన సన్నికల్లు అతి దృఢముగా ఉంటుంది. అలాంటి కఠినమైన దానిపై శివుడు తన వివాహ వేళలో అమ్మవారి సుతి మెత్తని పాదములను ఏ విధముగా ఉంచాడో'' అని శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో చేసిన వర్ణన (88వ శ్లోకం) ఈ సందర్భంలో స్మరణీయమైనది.

---

శార్దూలవిక్రీడితము

సుంభస్తే కిల దేవి! రాగకలహే పాదప్రహారోత్సవం

లబ్ధుం కాంక్షితవానుపాయమిహ ఖల్వజ్ఞో న విజ్ఞాతవాన్ .

యద్యాయోత్స్యత ఘోరమాహిషవపుర్ధారీ స వైరీ తతః

ప్రాఘానిష్యత మూర్ధ్ని కోమలరుచా పాదారవిందేన తే .. 34..

---

ప్రతి పదార్థము

దేవి! = ఓ పార్వతీదేవీ!, సుంభః = శుంభుడను రాక్షసుడు, తే = నీపై, రాగకలహే = ప్రేమతో కూడిన తగాదా కారణంగా, పాదప్రహార+ఉత్సవం = శృంగారంలో ప్రేయసి పాదాలు తలపై తాకించుకొనే ఉత్సాహాన్ని, లబ్ధుం = పొందుటకు, కాంక్షితవాన్ = కోరుకున్నాడు, కిల = కదా!, అజ్ఞః = అజ్ఞానియైన అతనికి, ఇహ = ఈ సందర్భంలో, ఉపాయమ్ = సరియైన ఉపాయము (మార్గం), న విజ్ఞాతవాన్ ఖలు = తెలియదుకదా!, యది = ఒకవేళ, సః = అతడు, ఘోరమాహిషవపుఃధారీ = భయంకరమైన మహిషాసురునిలా, వైరీ = నీతో శత్రువుగా మారి, తతః = అటుపిమ్మట, యాయోత్స్యత = యుద్ధం చేసి ఉంటే, తే = నీయొక్క, కోమలరుచా = లేత కాంతి కలిగిన, పాద+అరవిందేన = పాదపద్మముతో, మూర్ధ్ని = తలపై, ప్రాఘానిష్యత = కొట్టబడి ఉండేవాడు.

---

తాత్పర్యము

దేవీ! శుంభుడను రాక్షసుడు, తన పోరాట సమయంలో, నీపై తనకున్న ప్రేమ కారణంగా, శృంగారంలో ప్రేయసి పాదాలు తలపై తాకించుకొనే ఉత్సాహాన్ని నీ పాదాల ద్వారా పొందాలని కోరుకొన్నాడు; కానీ అజ్ఞానియైన అతనికి దాని మార్గం తెలియదు. భయంకరమైన మహిషాసురునిలా నీతో శత్రువైఖరితో యుద్ధం చేసి ఉంటే, నీ లేత కాంతి కలిగిన తామర పాదాలచే శుంభుడు కూడా తన తలపై కొట్టబడి ఉండేవాడు.

---

విశేషములు

''దేవీ! శుంభుడు అను రాక్షసుడు నిన్ను కామించి నీ పాద స్పర్శను శృంగారంలో తన తలపై కోరుకొన్నాడు. కాని అతడు అజ్ఞాని. నిన్ను కామించకుండా మహిషాసురునిలా నీతో శత్రువైఖరితో యుద్ధం చేసి ఉంటే, నీ పాదస్పర్శ శుంభునికి కూడా దక్కి ఉండే''దని భావం.

అమ్మవారిని కామించి శుంభుడు అమ్మయొక్క పాదస్పర్శ అను సువర్ణావకాశాన్ని పోగొట్టుకొన్నాడని కవి యొక్క భావనా చమత్కారం. మహిష పదానికి భట్టాత్రి కట్టిన అందమైన కల్పనా శిఖరము ఈ శ్లోకం.

---

శార్దూలవిక్రీడితము

ఆనమ్రే గిరిశే పదప్రహరణే దత్తే భవత్యా రుషా

``నాథే! కిం మహిషోఽహ" మిత్యభిహితే దేవేన తస్మిన్ క్షణే .

ఆలిష్వాకలితస్మితాసు, పునరప్యుద్దామపుష్యద్రుష-

స్తన్మౌలౌ జయతి ద్వితీయమపి తే పాదాబ్జసంతాడనం .. 35..

---

ప్రతి పదార్థము

ఆనమ్రే గిరిశే = శివుడు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు, భవత్యా = నీ చేత, రుషా = కోపంతో, పదప్రహరణే = పాదముల దెబ్బ, దత్తే = రుచిచూపిస్తారు (తాకబడింది). నాథే! అహమ్ మహిషః కిం = ప్రియురాలా! నేను మహిషుడినా ఏమి?, ఇతి+అభిహితే = అని పలుకుచున్న, దేవేన = శివ దేవునితో, తస్మిన్ క్షణే = వెనువెంటనే, ఆలిషు+ఆకలిత స్మితాసు = పరిచారకుల నవ్వుల మధ్య, పునః+అపి = మరలా, ఉద్దామ పుష్యత్+రుషః = పెరుగుతున్న కోపంతో, తత్+మౌలౌ =

అతని తలయందు, ద్వితీయమ్+అపి = రెండవసారి కూడా, తే = నీ యొక్క, పాద+అబ్జ సంతాడనం = పాదపద్మముల దాడి, జయతి = శోభిల్లుచున్నది.

---

తాత్పర్యము

దేవీ! శివుడు నువ్వు అలుక చెందిన సందర్భంలో నీకు సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు, నువ్వు కోపంతో నీ పాదాలతో ఆయనపై దాడి చేసావు. శివుడు అప్పుడు "దేవీ! నేను మహిషుడినా ఏమి?" అని అడుగుతాడు. ఆ సందర్భాన్ని చూస్తూ మీ పరిచారకులు నవ్వుతున్నారు. అప్పుడు పెరుగుతున్న కోపంతో, మీరు మళ్ళీ రెండవసారి మీ పద్మ పాదాలతో శివుని తలపై దాడి చేస్తారు. అది శోభిల్లుచున్నది.

---

విశేషములు

అహమ్ మహిషః కిం? (నేను మహిషుడినా ఏమి?) అను శివుని ప్రశ్నలోని మహిష పదానికి శ్లేష ఉన్నది.

మహిషుడనగా మహిషాసురుడను రాక్షసుడని ఒక అర్థం. దున్నపోతును మహిషమంటారు. దీనితో దేవతలను పూజింతురు. (మంహతి పూజయతి దేవాన్ అనేన) అందుకని దున్నపోతుకు మహిషమని పేరు. (మహిషాసురుడు) మహిషుడనగా రాజు అని రెండవ అర్థం. తన పురుషార్థంచే పూజింపబడువాడు (మహ్యతే పూజ్యతే స్వపురుషార్థేన) కనుక రాజును మహిషుడంటారు.

తనని మహిషునితో (మహిషాసురుడు) శివుడు పోల్చుకొంటే అమ్మవారు భరించలేకపోయింది. తన భర్త మహిషుడని (ఉత్తమోత్తముడయిన రాజు అని), తాను మహిషిని అని (మహిషస్య రాజ్ఞః కృతాభిషేకా పత్నీ - రాజుతో సహ పట్టాభిషేకం చేయబడిన రాజమహిషి.) అతనికి గుర్తు చేస్తూ మరలా రెండవసారి అతనికి ప్రేమతో సత్కారం చేసింది.

మహిష పదానికి భట్టాత్రి కట్టిన అందమైన కల్పనా శిఖరము ఈ శ్లోకం.

---

శార్దూలవిక్రీడితము

పాదాగ్రంతవ సంగరశ్రమవశాదాక్షారిలాక్షారసం
విన్యస్తం మృగనాయకోపరి చిరాజ్జీయాదగేంద్రాత్మజే! .
యత్కాంత్యైవచ లోహితో మృగపతిర్దైత్యప్రహారోద్గల-
ద్రక్తాంభఃకణికావహన్నపి తథా నామాని వైమానికైః .. 36.

---

ప్రతి పదార్థము

అగ+ఇంద్ర+ఆత్మజే! = హిమాలయాల పుత్రికా!, సంగరశ్రమవశాత్ = యుద్ధంలో కొంచెం అలసిపోయినందున, తవ = నీయొక్క, పాద+అగ్రం = పాదముల చివర, అక్షారి లాక్షారసం = ఎర్రటి లక్కరసము, మృగనాయక+ఉపరి = జంతువులకు రాజైన సింహంపై, విన్యస్తం = ఉంచబడింది. (అటువంటి మీ పాదాలు) చిరాత్+జీయాత్ = దీర్ఘకాలం సర్వోత్కృష్టముగా ప్రకాశించుగాక!!

యత్+కాంత్యా+ఏవ చ = ఏ నీ కాంతివలన, మృగపతిః = సింహం, లోహితః = ఎరుపు రంగులో ప్రకాశిస్తుంది. దైత్య = రాక్షసులను, ప్రహార = కొట్టిన దెబ్బలవలన, ఉద్గలత్ = వారి శరీరాలనుండి కారుచున్న, రక్త+అంభఃకణికా = రక్తపు

బిందువులను, వహన్+అపి = వహించినప్పటికి, తథా = ఆ విధంగా (నిన్ను మోసిన సందర్భంలో గౌరవించినట్లుగా), వైమానికైః = విమానాలలో ఆకాశంలో ప్రయాణించే సిద్ధులు, నా మాని = ఆ సింహాన్ని ప్రత్యేకంగా గౌరవించరు.

---

తాత్పర్యము

హిమాలయాల పుత్రికా! యుద్ధంలో కొంచెం అలసిపోయినందున జంతువులకు రాజైన సింహంపై నువ్వు కూర్చున్నప్పుడు, నీ పాదాలకున్న ఎర్రటి లక్కరసము సింహానికి అంటుకున్నది. అటువంటి మీ పాదాలు దీర్ఘకాలం ప్రకాశించుగాక! నీ పాదాల ఎర్రటి లక్కరసము యొక్క మెరుపు కారణంగా, సింహం ఎరుపు రంగులో (శరీరమంతటా) ప్రకాశిస్తుంది. దేవతలచే కూడా పూజించబడుతుంది.

అదే సింహం విడిగా (అమ్మను మోయకుండా) రాక్షసులతో యుద్ధం చేసే సమయంలో వారి శరీరాలనుండి కారుచున్న రక్తపు బిందువులతో ఎర్రగా తడిసిపోతుంది. ఆ రక్తపు బిందువులతో ఎరుపు మెరుపులతో ఉన్నప్పటికి విమానాలలో ఆకాశంలో ప్రయాణించే సిద్ధులు సింహాన్ని ప్రత్యేకంగా గౌరవించరు.

---

విశేషం

సింహం అమ్మవారిని మోస్తున్నప్పుడు, అది అమ్మవారి పాదాల లాక్షారసపు ఎరుపుతో ప్రకాశిస్తుంది. దేవతలచే కూడా పూజించబడుతుంది.

కానీ, అదే సింహం రాక్షసులతో పోరాడుతున్నప్పుడు రక్తంలో తడిసినప్పుడు - ఒంటిమీద ఎరుపురంగు ఉన్నప్పటికి దానిని ఎవరూ పూజించరు.

అమ్మవారి పాదాల ఎరుపు మెరుపు యొక్క ప్రత్యేకతను ఈ శ్లోకాక్షరాలలో కవి మెరిపించాడు.

---

శార్దూలవిక్రీడితము

నైవాలింప నిలింపమూర్ధసు, న వా సింహోపరిత్యజ్యతాం
మా చేదం మహిషస్య మూర్ధ్ని రభసాదాలిప్య లోలుప్యతాం .
పత్యుర్మౌలినదీజలే పరమిదం సంక్షాలనీయం త్వయే-
త్యాలీకేలిగిరో జయంతి గిరిజే! త్వత్పాదలాక్షార్పణే .. 37..

---

ప్రతి పదార్థము

అయే గిరిజే! = ఓ హిమాలయాల పుత్రికా!, నిలింపమూర్ధసు = దేవతల తలలపై, నైవాలింప = పూయవద్దు, న వా సింహ+ఉపరి = నీ వాహనమైన సింహాన్ని కూడా, న వా త్యజ్యతాం = విడిచిపెట్టు (దానిపై కూడా పూయవద్దు), ఇదం = ఈ పాదాలకు పూసిన ఎర్రటి పూతను, మహిషస్య మూర్ధ్ని = మహిషాసురుని తలపై కూడా, మా చ = పూయవద్దు.

రభసాత్ = వేగంగా, ఆలిప్య = పూత పూసుకొనే, లోలుప్యతాం = ఎక్కువ ఆశ కలిగిన, పత్యుః = నీ భర్త అయిన శివుని యొక్క, మౌళిలినదీజలే = తలపై ఉన్న నదీ నీటిలో మాత్రమే, పరమ్+ఇదం = ఈ అత్యంత పవిత్రమైన పూత, సంక్షాలనీయం తు = కొట్టుకుపోతుంది, ఇతి = అని త్వత్+పాదలాక్ష+అర్పణే = నీ పాదాలకు ఎర్రటి పూతను పూసినప్పుడు చెప్పే, ఆలీకేలిగిరః = మీ పరిచారకుల పరిహాసపు మాటలు, జయంతి = జయింపబడుచున్నవి.

---

తాత్పర్యము

ఓ హిమాలయాల పుత్రిక! పార్వతీదేవి! మీ పరిచారకులు మీ పాదాలకు ఎర్రటి పూతను పూసినప్పుడు, వారు చక్కగా హాస్యాస్పదంగా ఇలా అంటారు:

"పార్వతీ! సాష్టాంగ నమస్కారం చేసినప్పుడు దేవతల తలలపై ఈ ఎరుపు పూత పూయవద్దు. నీ వాహనమైన సింహముపై ఈ ఎరుపు పూత పూయవద్దు. నువ్వు మహిషాసురుడిని నీ పాదాలతో తన్నినప్పుడు అతని తలపై కూడా వద్దు. ఈ అత్యంత పవిత్రమైన లక్కరసపు పూత మీ భర్త తలపై ఉన్న గంగా నదినీటిలో మాత్రమే కొట్టుకుపోతుంది" అని చెప్పే మీ పరిచారకుల పరిహాసపు మాటలు జయింపబడుచున్నవి.

---

విశేషాలు

"భర్త తలపై ఉన్న గంగా నదినీటిలో మాత్రమే కొట్టుకుపోతుంది" అను భావనలో సున్నితమైన వ్యంగ్యం ఉంది. పాదాలపై ఉన్న పూత శివుని నెత్తి మీద ఉన్న గంగానదినీటిలో ఎప్పుడు కొట్టుకుపోతుంది? ఊహించుకోగలిగిన వారికి ఊహించుకొన్నంత. స్వస్తి.

---

శార్దూలవిక్రీడితము

నత్వైవప్రథమం త్వదంఘ్రికమలం తౌ పుష్పవంతావుభౌ

త్రైలోక్యం మహసాభిభూయ చరతో వ్యోమాంతరప్రాంతరే .

నాథే! తౌ కథమన్యథా పరిగలల్లాక్షారసక్షాలితౌ

వీక్ష్యేతే భృశశోణిబింబముదయారంభే ప్రియంభావుకౌ .. 38..

---

ప్రతి పదార్థము

నాథే! = జగదీశ్వరీ!, తౌ ఉభౌ పుష్పవంతౌ = ఆ సూర్య చంద్రులు ఇద్దరు (నిత్య ద్వివచనాంతము), ప్రథమం = మొదట, త్వత్+అంఘ్రికమలం = నీ కమల పాదాలకు, నత్వా+ఏవ = నమస్కరించిన పిదప. త్రైలోక్యం = మూడు లోకాలలోనూ, మహసా = తమ అద్భుతమైన కాంతితో, అభిభూయ = చీకటిని ఓడించి, వ్యోమ+అంతరప్రాంతరే = విశాలమైన ఆకాశంలో, చరతః = ప్రయాణిస్తారు. అన్యథా = లేకపోతే, పరిగలత్ = నీ పాదాల నుండి జారిన, లాక్షారస = ఎర్రని లక్కరసముచే, క్షాలితౌ = కడగబడినట్లుగా (తడిసినట్లుగా), తౌ కథమ్ = వారిద్దరు ఎట్లు, ఉదయ+ఆరంభే = ఉదయారంభములో, ప్రియంభావుకౌ = ఆకర్షణీయంగా, భృశశోణిబింబమ్ = ఇంత లోతైన ఎరుపు రంగుతో, వీక్ష్యేతే = ఎలా కనబడతారు?

---

తాత్పర్యము

జగదీశ్వరీ! పార్వతీ! సూర్యుడు మరియు చంద్రుడు మొదట నీ పద్మ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి, ఆపై వారు విశాలమైన ఆకాశంలో ప్రయాణించి, మూడు లోకాలలోనూ తమ అద్భుతమైన కాంతిని ప్రసరిస్తారు. లేకపోతే, నీ పాదాల నుండి కురిపించే ఎర్రటి లాక్షారసములో తడిసినట్లుగా, పైకి లేచే సమయంలో సూర్య చంద్రులు ఇంత లోతైన ఎరుపు రంగుతో చాలా ఆకర్షణీయంగా ఎలా ప్రకాశిస్తూ కనబడతారు?

---

విశేషాలు

సూర్యుడు మరియు చంద్రుడు ప్రాతః కాలములో అద్భుతమైన ఎరుపు రంగుతో ఉంటారు. వారు ప్రతిరోజూ ప్రారంభంలో అమ్మవారి పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తారని - అందుకే - అమ్మవారి ఎరుపు లక్క పూతలలో ఎర్రగా ప్రాతః కాలంలో కనబడతారని భట్టాత్రి మనోహరమైన ఊహ.

“కామాక్షీ! నీ పాదము సూర్యుడు. నా మనస్సు తూర్పు కొండలు. నీ పాద సూర్యుడు - ఎర్రని కాంతులతో నాలో అజ్ఞానపు చీకట్లను పారద్రోలి, అత్యున్నత జ్ఞాన కమలం వికసింపజేసి నా మనస్సనే తూర్పు పర్వతానికి తిలకంలా ప్రకాశించుగాక!” (మూక పంచశతి 02-17) అను భావము కూడా ఈ సందర్భంలో స్మరణీయమైనది.

---

శార్దూలవిక్రీడితము

త్రైలోక్యం వశయంతి, పాపపటలీముచ్చాటయంత్యుచ్చకై-

ర్విద్వేషం జనయంత్యధర్మవిషయే ప్రస్తంభయంత్యాపదః .

ఆకర్షంత్యభివాంఛితాని మహిషస్వర్వైరిణో మారణా-

శ్చిత్రం! త్వత్పదసిద్ధచూర్ణనివహాః షట్కర్మణాం సాధకాః .. 39..

---

ప్రతి పదార్థము

త్రైలోక్యం = మూడు లోకాలను, వశయంతి = వశము చేసుకొంటారు. ఉచ్చకైః = ఉన్నత స్థానములో ఉన్న, పాపపటలీమ్ = అంతులేని జన్మల లో పోగుచేసిన తమ పాపాల కుప్పను, ఉచ్చాటయంతి = తరిమికొడతారు.

అధర్మవిషయే = అధార్మిక విషయాల పట్ల, విద్వేషం = ద్వేషమును, జనయంతి = కలిగిస్తారు. ఆపదః = ఆపదలను, ప్రస్తంభయంతి = కదలకుండా చేస్తారు. అభివాంఛితాని = కోరికలన్నింటినీ, ఆకర్షంతి = ఆకర్షిస్తారు. స్వః వైరిణః = దేవతలకు శత్రువయిన, మహిషః = మహిషాసురుడిలా, మారణాః = కామ, క్రోధ మొదలైన ఆరు శత్రువులను, నిర్మూలిస్తారు. త్వత్+పదసిద్ధచూర్ణనివహాః = నీ పవిత్ర పాద ధూళిని తలపై మోస్తున్న నీ భక్తులు, షట్కర్మణాం = ఆరు విభిన్న కార్యక్రమాలలో, సాధకాః = సాధకులు కావటం, చిత్రం = అద్భుతం.

---

తాత్పర్యము

ప్రాచీన మంత్రాల వాడుక విధానం ప్రకారం, ఆరు లక్ష్యాలను సాధించడానికి ఆరు వేర్వేరు మంత్ర కర్మలను నిర్వహిస్తారు. దేవీ భక్తుడు ఆ మంత్రాచారాలు లేకుండా, ఆరు రంగాలలో విజయం తనకు అప్రయత్నంగా పొందుతున్నాడని కవి వర్ణిస్తున్నాడు.

మంత్ర విధానాలలో మొదటిది. వశ్యం. అంటే ఒకరిని మంత్ర వశ్యులు చేయటం. నీ భక్తులకు మూడు లోకములు తాము జపించే నీ మంత్రాధీనములై ఉన్నాయి.

రెండవది, ఉచ్చాటనం. అనగా దుష్టశక్తులను తరిమికొట్టడం; భక్తులు అంతులేని జన్మల లో పోగుచేసిన తమ పాపాల కుప్పను తరిమికొడతారు.

మూడవది, విద్వేషణం. అంటే ద్వేషాన్ని విత్తడం. నీ భక్తుడు అధార్మిక విషయాల పట్ల ద్వేషాన్ని పెంచుతాడు. నాల్గవది, స్తంభం, అనగా కదలకుండా చేయడం; నీ భక్తులు ఆపదలను కదలకుండా చేస్తారు. (ఆపదల పాలు కారని భావం)
ఐదవది ఆకర్షణం. అంటే ఆకర్షించడం; భక్తులు తమ కోరికలన్నింటినీ తమవైపు వచ్చేటట్లు ఆకర్షిస్తారు. (కోరికలు నెరవేర్చుకొంటారని భావం)
ఆరవది, మరణం, అంటే నిర్మూలనము. నీ భక్తులు కామ, క్రోధ, లోభము మొదలయిన ఆరుగురు శత్రువులను మహిషాసురుడిలా నిర్మూలిస్తారు.
దేవీ! ఇలా నీ పవిత్ర పాదధూళిని తలపై మోస్తున్న నీ భక్తులు ఏకకాలంలో ఆరు విభిన్న కార్యక్రమాలలో విజయం సాధించడం అద్భుతం.

---

విశేషాలు
మంత్రాలతో ఆరు ఆచారాలను ఉపయోగించడం కేరళలో పూర్వం ఎక్కువగా ఉండేది. దేవి యొక్క అపరిమితమైన అనుగ్రహాన్ని వివరించడానికి ఆ కేరళ స్థానిక ఆచారాల నుండి తీసుకోబడిన ఒక మంత్రోదాహరణను భట్టాత్రి ఇక్కడ కవితా పరంగా, శరణాగతి భావంతో వ్యాఖ్యానించాడు.
శ్రీమూక పంచశతిలో కూడా ఇలాంటి శ్లోక భావం కనిపిస్తుంది. (2:54)
"ఓ తల్లీ! కామాక్షీ! నిన్ను సదా శరణన్న వారికి సంపదనాకర్షించు, శక్తివంతమైన సంసారం యొక్క పెరుగుదల ఆపుచేసే స్తంభన జపాన్ని, మన్మథ విధ్వంసకుడైన శివుని మనస్సును వశ్యం చేసే మోహన జపాన్ని, సమర్థమైన నీ పాదమంజీర నాదము మాకు ఇచ్చి మమ్ము రక్షించుగాక!"

---

శార్దూలవిక్రీడితము
కింకల్పద్రుమపంచకం ప్రణమతామాకాంక్షితాపాదనే
కింపంచాయుధబాణపంచకమిదం మారారిసమ్మోహనే .
సూక్ష్మం కించన పంచభూతవపుషో విశ్వస్య కిం కారణం
త్వత్పాదాంగులిపంచకాత్మకమిదం కిం భాతి శంభోః ప్రియే! .. 40..

---

ప్రతి పదార్థము
శంభోః ప్రియే! = శివుని ప్రియురాలా!, పార్వతీదేవీ!, కిం = ఎలా, ఇదం = ఈ నీ, త్వత్+పాద = నీ పాదమునకు సంబంధించిన, అంగులిపంచక+ఆత్మకమ్ = ఐదు వేళ్ళ సముదాయము, భాతి = ప్రకాశిస్తుంది?
ప్రణమతామ్+ఆకాంక్షిత+ఆపాదనే = సాష్టాంగ నమస్కారం చేసేవారి కోరికలు తీర్చడంలో, కల్పద్రుమపంచకం కిం = ఐదు కల్పవృక్షాలు కదా! (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము), మార+అరిసమ్మోహనే = మన్మథ శత్రువైన శివుని ఆకర్షించడంలో, పంచ+ఆయుధబాణపంచకమ్+ఇదం కిం = మన్మథుని అయిదు పుష్పాయుధాలా ఏమి? (1. అరవిందము, 2. అశోకము, 3. చూతము, 4. నవమల్లిక, 5. నీలోత్పలము.), పంచభూతవపుషః = ఐదు గొప్ప మూలకాలతో రూపొందించబడిన, విశ్వస్య = విశ్వము యొక్క, కించన సూక్ష్మం = సూక్ష్మాతి సూక్ష్మమయిన కారణం కిం

= కారణాలా ఏమి? (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశములయొక్క శబ్దస్పర్శ రూపరసగంధములు).

---

తాత్పర్యము

పార్వతీదేవియొక్క పాదములోని అయిదు వేళ్ళు సాష్టాంగ నమస్కారం చేసేవారి కోరికలు తీర్చడంలో ఐదు కల్ప వృక్షాలని, మన్మథుని ఐదు బాణాలని, విశ్వసృష్టికి మూలమయిన శబ్దస్పర్శ రూపరసగంధములను అయిదు సూక్ష్మ కారణాలని కవి అభిప్రాయం.

---

శార్దూలవిక్రీడితము

డోలాకేలిషు దూరదూరగమనే ప్రేంఖోలనావిభ్రమే
మేదిన్యామనిపాతితం జయతి తే నాథే! పదాంభోరుహం .
భక్త్యాసన్నమతాం త్వదాననగలద్గానామృతామూర్ఛయా
భూపృష్ఠే చిరశాయినాం దివిషదామాఘట్టనాసాధ్వసాత్ .. 41..

---

ప్రతి పదార్థము

నాథే! = ఓ ఐశ్వర్యవంతురాలా!, పార్వతీ!, డోలాకేలిషు = ఊయల ముందుకు వెనుకకు కదులుతున్నప్పుడు, ప్రేంఖోలనావిభ్రమే = ఆ ఊయల విలాసములలో, దూరదూరగమనే = దూరంగా మరియు సమీపంలోకి కదులుతున్నప్పుడు, తే = నీయొక్క, పద+అంభోరుహం = పాదపద్మమును, మేదిన్యామ్ = భూమికి, అనిపాతితం = తాకించరు, జయతి = అది లోకములో నీ అనుగ్రహ చర్యగా కీర్తించబడుచున్నది.

(ఎందుకనగా) భక్త్యాసన్నమతాం త్వత్+ఆనన = నీ నోటినుండి, గలత్ = ప్రవహించే, గాన+అమృతా = సంగీత మకరందాన్ని, అతిగా తాగడం వల్ల, మూర్ఛయా = మైకంలో ఉండి, భూపృష్ఠే = భక్తితో సాష్టాంగపడి నేలపై, చిరశాయినాం = ఎక్కువ సేపు పడుకుని ఉన్న, దివిషదామ్ = దేవతలకు, ఆఘట్టనాసాధ్వసాత్ = నీ పాదాల ఒరిపిడి తగులుతుందేమో అను భయముతో (పాదపద్మమును భూమిపై తాకించరు).

---

తాత్పర్యము

ఓ ఐశ్వర్యవంతురాలా! పార్వతీ! నువ్వు ఊయలలో ఊగుతూ, ఊయల ముందుకు వెనుకకు దూరంగా మరియు సమీపంలోకి కదులుతున్నప్పుడు, నువ్వు నీ పద్మ పాదాలతో నేలను తాకించవు. ఎందుకంటే, నీ నోటి నుండి ప్రవహించే సంగీత మకరందాన్ని అతిగా తాగడం వల్ల మైకంలో ఉండి, భక్తితో సాష్టాంగపడి, నేలపై ఎక్కువ సేపు పడుకుని ఉన్న దేవతలకు నీ పాదాల ఒరిపిడి తగులుతుందేమో అను భయముతో పాదపద్మమును భూమిపై తాకించవు.

---

విశేషాలు

1. అమ్మవారు ఊయల ఊగుతూ అద్భుతంగా సంగీత గానం చేస్తారని, అది విన్న మత్తులో దేవతలు భక్త్యతిశయంతో భూమిపై అలా పడిపోయి ఉంటారని ఒక సుందరమైన దృశ్యాన్ని తన సమాధ్యవస్థలో చూసిన భక్తకవి భట్టాత్రి ఈ శ్లోకం వ్రాసాడు.
2. మేదిన్యామనిపాతితంజయతి - మేదిన్యాం వినిపాతితం జయతి అని రెండు పాఠాలు కనబడుతున్నాయి.

మేదిన్యాం-అనిపతితం అంటే నేలపై పడిఉన్న దేవతలను కొట్టకుండా ఉండేందుకు అని అర్థం తీసుకోవాలి.

మేదిన్యాం వినిపాతితం అనే పాఠాన్ని తీసుకుంటే, దేవతలు కొండల సానువుల నుండి దొర్లకుండా, పాదాల ధ్వనితో, కొంతవరకు నేలపై ఉన్న దేవతలను స్పృహలో ఉంచడానికి, పాదాలతో నేలను కొడుతోంది అను అర్థం వస్తున్నది. ఈ రెండు రకాల వివరణతో శ్లోకం రెండింతలు అందంగా ఉంది. భక్తుల పట్ల దేవి యొక్క ప్రత్యేక కరుణ మరోసారి ఈ శ్లోకంలో ప్రశంసించబడింది.

సౌందర్యలహరిలో అమ్మవారి మాటల లోని తీపిని వర్ణించే ఈ 66వ శ్లోకభావం ఈ సందర్భంలో స్మరణీయమైనది.

"జగజ్జననీ! ఈశ్వరుని యొక్క వివిధ సాహస కృత్యములు చరిత్రలు మొదలగు వాటిని సరస్వతీ దేవి తన వీణతో గానము చేస్తోంది. నువ్వు ఆనందముతో తల ఊపుతూ ప్రశంసావాక్యములు పలికావు. ఆ ప్రశంసావచనములు తన వీణానాదము కన్న మధురముగా ఉన్నాయని తలచి సరస్వతీ దేవి తన వీణాగానమును ఆపివేసి, తన వీణను పై ముసుగుచేత కనబడకుండా బాగుగా కప్పుచున్నది."

శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములో గూడా వ్యాసుల వారు "నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ" (27 వ నామం) "తన యొక్క సంభాషణయొక్క తియ్యదనము చేత విశేషముగా తిరస్కరింపబడిన, కచ్ఛపీ అను పేరుగల వీణగలది." అని అమ్మవారి వాక్కుల మాధుర్యాన్ని కొనియాడారు.

---

శార్దూలవిక్రీడితము

మంజీరప్రసరన్మసారసుషమారూపాకలిందాత్మజా

స్వచ్ఛచ్ఛాయనఖాంశుసంచయమయీ గంగా చ సంగాముకా .

శోణః పాదరుచాం చయశ్చ మిలితో యేన త్వదగ్రే, తతో

మజ్జంతీవ నమంతి తత్ర మునయః సర్వేఽపి శర్వాంగనే .. 42..

---

ప్రతి పదార్థము

శర్వ+అంగనే = దుఃఖములను పోగొట్టు శివుని భార్యా!, పార్వతీ!, యేన తత్+అగ్రే = దేనిచేత నీ పాదాలకు చుట్టుకొన్న, మంజీర = మధుర శబ్దమును చేయు నూపురము నుండి, ప్రసరత్ = ప్రసరించుచున్న, మసార = (మసం పరిణామం ఋచ్ఛతిప్రాప్నోతి) మార్పు పొందు ఇంద్రనీలమణి రంగు, సుషమారూపా = మిక్కిలి శోభ కలిగిన, కలింద+ఆత్మజా = కలింద పర్వతమునందు పుట్టిన యమునా రూపాన్ని (పొందుతుంది).

అముకా = పేరు చెప్పక సూచించు ఆ కాంతి, సంచయమయీ = సమూహముతో, సంగ = కలగలిసి, నఖ+అంశు = నీ తెల్లని వేలిగోళ్ల కాంతి, స్వచ్ఛత్+ఛాయ = స్వచ్ఛమైన కాంతి కలిగిన, గంగా చ = గంగానదిగా మారుతుంది.

యః చ = ఏ నీ, పాదరుచాంచ = పాదాల ఎరుపు రంగు కాంతి, శోణః = శోణానదిగా మారి, మిలితః = ఇతర రెండు నదులతో కలిసిపోతుంది. తతః = అటుపిమ్మట, మజ్జంతి+ఇవ = త్రివేణిలో స్నానం చేసినట్లుగా, తత్ర = నీ పాదాల దగ్గర నిలబడిన, మునయః = మునులు, సర్వే+అపి = అందరు కూడా, నమంతి = సాష్టాంగ నమస్కారం చేస్తారు.

---

తాత్పర్యము

శివుని భార్యా! నీ పాద మంజీరాల నుండి వెలువడే మంత్రముగ్ధమైన నీలిరంగు యమునా రూపాన్ని సంతరించుకుంటుంది. ఆ ప్రకాశంతో కలగలిసి, నీ తెల్లని వేలిగోళ్లు స్ఫటికం లాంటి తేజస్సును వ్యాపింపజేసి, అది స్వచ్ఛమైన గంగగా మారుతుంది. నీ పాదాల ఎరుపురంగు ప్రకాశము ఎర్రని శోణా నదిగా మారి ఇతర రెండు నదులతో కలిసిపోతుంది. త్రివేణిలో స్నానం చేసినట్లుగా భావించి ఋషులందరూ నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తారు.

---

శార్దూలవిక్రీడితము

మంజీరార్పితశక్రనీలశకలశ్రీచంచలీకాంచితం
రాజద్రేణువిభూషితం పరమహంసాలీభిరాసేవితం .
త్వత్పాదాగ్రసరోజమంగులిదలచ్ఛాయాభిరాభాసురం
విష్వగ్రోచినఖాంశుజాలపయసి స్వచ్ఛే సముచ్ఛోభతే .. 43..

---

ప్రతి పదార్థము

మంజీర = మధుర శబ్దమును చేయు నూపురముకు, అర్పిత = అర్పింపబడిన, శక్రనీలశకలశ్రీ = ఇంద్రనీల మణుల ఖండములతో, చంచలీక+అంచితం = తుమ్మెదలతో కూడుకొన్నది.

రాజత్ = ప్రకాశించు, రేణువిభూషితం = వివిధ రంగుల పొడులతో అలంకరించబడినది.

పరమహంస+ఆలీభిః+ఆసేవితం = ఆనందాత్మను నేను అని ఎరుక కలిగిన పరమహంసలచే సేవింపబడినది.

అంగులి = వేళ్ళను, దలత్+ఛాయాభిః = తమ చీల్చబడిన నీడలతో, ఆభాసురం = ప్రకాశింపచేయునది.

విష్వక్ = అంతటా వ్యాపించిన, రోచినఖ+అంశుజాల = వ్రేళ్ళగోళ్ల యొక్క, స్వచ్ఛే = తెల్లని స్వచ్ఛమయిన, పయసి = నీటిశాలయందు, త్వత్+పాద+అగ్రసరోజమ్ = నీ పాదముల జంటయను ఉన్నత పద్మము, సముచ్ఛోభతే = చక్కగా ప్రకాశిస్తున్నది.

---

తాత్పర్యము

అమ్మా! పార్వతీ! నీ వ్రేలి గోళ్లు తెల్లని స్వచ్ఛమైన సరస్సు. నీ చీలమండలలోని ఇంద్రనీల మణులు ఆ సరస్సులోని నీ పాదపద్మములో తిరిగే తేనెటీగలు; నీ పాదాలంకారములకు వేసిన బంగారు పొడులు నీ పాదపద్మపు పుప్పొడులు. నిన్ను సేవించే పరమహంసల వరుసలు నీ పాదపద్మముల చుట్టూ తిరిగే హంసలు; ఈ సరస్సులోని తామరపూలు నీ పాదముల జంట చక్కగా ప్రకాశించుచున్నది.

---

విశేషాలు

మూకపంచశతిలోని ఈ క్రింది శ్లోక భావం (2-47) ఈ సందర్భంలో స్మరణీయమైనది.

కామాక్షీ! వెన్నెల కాంతులను (పాదపు) గోటికొనల కాంతిచే మీటిపారవేస్తూ, హంసల (రాజహంసలు - పరమహంసలు) మనసులకు ఆనందాన్ని విస్తరింపచేస్తూ, వికసిస్తున్న లేత పద్మాల కాంతితో ప్రకాశము అను లక్ష్మిని వహించి, నీ పాదము శరత్కాల సామర్థ్యాన్ని అందిస్తోంది.

---

శార్దూలవిక్రీడితము

మంజీరస్వనమంజువిష్కిరరవే తత్సంగినీలోపల-

చ్ఛాయారూపతమోలవే నఖమిషాదక్షీణతారాగణే .

సంధ్యారాగనిభస్వకాంతిపటలే త్వత్పాదమూలాత్మక-

ప్రత్యూషోపగమే హి దేవి! లభతే లోకః ప్రబోధోదయం .. 44..

---

ప్రతి పదార్థము

దేవి! = (దీవ్యతి కృతాభిషేకా రాజమహిషీ) అనేక విధములుగా ఆడుదానా!, దుర్గాదేవీ!, మంజీరస్వన = మధుర శబ్దమును చేయు నీ నూపురములు, మంజు = మనోహరమైన, విష్కిరరవే = కోడి కూతలు చేయుచుండగా, (విష్కిర = వికిరతి తస్య భావః కర్మవా - వెదజల్లునది).

తత్సంగి = వాటితో కలిసిన, నీలోపలత్+ఛాయారూప = చీలమండలలో నీ నీలమణి రత్నాలు, తమోలవే = తెల్లవారుజామున మసక కాంతిని ప్రసరింపజేస్తుండగా.

నఖమిషాత్ = నీ పాదాలలోని గోరుల సాకుతో, అక్షీణతారాగణే = నక్షత్రాలు చక్కగా ప్రకాశిస్తుండగా.

సంధ్యారాగ = సంధ్య రాగముతో, నిభ = సమానమయిన, స్వకాంతిపటలే = తన ఎర్రని కాంతి సమూహముతో, త్వత్+పాదమూల+ఆత్మక = మీ పాదమూలకమైన (అనగా మీ పాదములను) ప్రత్యూష+ఉపగమే = చీకటిని నాశనము చేయు ప్రభాత కాలము సమీపించగా (తెల్లవారుజాము), లోకః = లోకానికి, ప్రబోధ+ఉదయం = సూర్యోదయము, లభతే హి = లభిస్తుంది కదా!

---

తాత్పర్యము

తెల్లవారుజామున కలిగే సూర్యోదయాన్ని కవి అమ్మవారి పాదాలతో పోలుస్తున్నాడు.

దుర్గాదేవీ! మధుర శబ్దమును చేయు నీ నూపురములు, మనోహరమైన, కోడి కూతలు చేయుచుండగా, వాటితో కలిసిన, చీలమండలలో నీలమణి రత్నాలు తెల్లవారుజామున మసక కాంతిని ప్రసరింపజేస్తుండగా, నీ పాదాల లోని గోరుల సాకుతో, నక్షత్రాలు చక్కగా ప్రకాశిస్తుండగా, సంధ్య రాగముతో సమానమయిన ఎర్రని కాంతి సమూహముతో మీ పాదములను సూర్యోదయము, భక్తులకు లభిస్తుంది.

మీరు అడిగిన విధంగా, ప్రతి శ్లోకంలోని ప్రతి పదార్థంలో అర్థాలను పక్కపక్కన, కామాలతో వేరుచేస్తూ సవరించి తిరిగి వ్రాస్తున్నాను.

---

శార్దూలవిక్రీడితము

విద్యాముక్తిరమావధూషునితరాం కామాతురా మానవా-
స్తప్తాస్త్వన్నఖకాంతిచందనరసైరాలిప్యగాత్రం నిజం .
త్వత్పాదాబ్జరుచిప్రవాలనిచితేభూమీతలే శేరతే
నిత్యందేవి! భవత్కృపాప్రియసఖీవిశ్వాసతః కేవలం .. 45..

ప్రతిపదార్థం:

దేవి! = ఓ పార్వతీదేవి!, విద్యాముక్తిరమావధూషు = జ్ఞానం, విముక్తి మరియు సంపదలనెడి స్త్రీలయందు, నితరాం = ఎల్లప్పుడూ, కామాతురాః = కామము కలిగిన, మానవాః = మానవులు, తప్తాః = తపించుపోతూ (కాలిపోతూ), త్వత్+నఖ కాంతిచందనరసైః = నీ పాద గోటికాంతులనెడి గంధపు ముద్దను, నిజం గాత్రం = తమ శరీరాలపై, ఆలిప్య = పూసి, త్వత్ = నీ, పాద+అబ్జరుచిప్రవాలనిచితే = నీ పాదపద్మముల కాంతి పగడాలతో కప్పబడిన, భూమీతలే = భూతలమునందు, కేవలం = కేవలము, నిత్యం = ఎల్లప్పుడూ, భవత్ = నీ యొక్క, కృపాప్రియసఖీ = దయ అనెడి ప్రియసఖి, విశ్వాసతః = విశ్వాసము కొరకు మాత్రమే, శేరతే = శయనిస్తారు (సాష్టాంగ నమస్కారం చేస్తారు).

తాత్పర్యము:

ఓ పార్వతీదేవి! జ్ఞానం, విముక్తి మరియు సంపదలనెడి స్త్రీలయందు ఎల్లప్పుడూ తీవ్రమైన కోరికలు కలిగిన మానవులు, ఆ కోరికల తాపముతో కాలిపోతూ, చల్లదనం కొరకు నీ పాద గోటికాంతులనెడి గంధపు ముద్దను తమ శరీరాలపై పూసుకుంటారు. నీ పాదపద్మముల కాంతి పగడాలతో కప్పబడిన భూతలమునందు, కేవలం నీ దయ అనెడి ప్రియసఖిపై ఉన్న విశ్వాసం కొరకు మాత్రమే సాష్టాంగ నమస్కారం చేస్తారు. (అమ్మవారి దయ ఉంటే జ్ఞానం, విముక్తి మరియు సంపదలు సిద్ధించునని భావం. అమ్మవారి దయ కోసమే భక్తులు నమస్కరిస్తారని, జ్ఞానం, విముక్తి, సంపదల కోసం మాత్రమే కాదని ధ్వని.)

---

శార్దూలవిక్రీడితము

మంజీరక్వణితైఃక్షిపన్నివ ముహుః శ్రీమన్నఖాంశూద్గమై-
ర్దైత్యేంద్రంప్రహసన్నివారుణరుచా రుష్యన్నివాస్మై భృశం .
ధీరాయాంత్వయి నిర్వికారమనసి త్వత్పాద ఏవ స్ఫుటం
పుష్ణన్వైరివికారమేష మహిషధ్వంసీ పరిత్రాయతాం .. 46..

ప్రతిపదార్థం:

మహిషధ్వంసీ = ఓ మహిషాసుర మర్దినీ!, మంజీరక్వణితైః = నూపురముల (కాలి అందెల) మోతతో, క్షిపన్+ఇవ = ఆక్షేపించుచున్న వానివలె, ముహుః = మాటిమాటికి, శ్రీమత్ = శోభ కలిగిన, నఖ+అంశు+ఉద్గమైః = గోటి కిరణాల బయటకు వెడలుటవలన, దైత్య+ఇంద్రం = రాక్షసరాజైన మహిషాసురుని, ప్రహసన+ఇవ = అపహాస్యం చేసే చిరునవ్వులా, అరుణ రుచా = ఎర్రని (పాదముల) కాంతి మెరుపు, రుష్యన్+ఇవ = గొప్ప కోపాన్ని (చూపుతున్న వానివలె), అస్మై = మహిషాసురుని పట్ల, భృశం = అధికముగా (ఉన్నది), త్వయి = నీయందు, ధీరాయాం నిర్వికారమనసి = జ్ఞాన స్వరూపమైన, నిర్వికారమైన మనస్సు ఉన్నప్పటికి, త్వత్+పాద ఏవ = మీ పాదములందు, స్ఫుటం = స్పష్టముగా, ఏషః వైరివికారమ్ = ఈ శత్రువు పట్ల ఉన్న వికారము (కోపం), పుష్ణన్ = సమర్థించుచున్నది, పరిత్రాయతాం = అట్టి నీ పాదము నన్ను రక్షించుగాక.

తాత్పర్యము:

ఓ దేవీ! నీ మనస్సులో ఎటువంటి వికారాలు లేవు. కానీ నీ పాదంలో మాత్రం మహిషాసురుని పట్ల విద్వేషం ఉన్నది. నూపురాల మోతతో అతన్ని ఆక్షేపించుచున్న వానివలె, మాటిమాటికీ శోభాయమానమైన గోటి కిరణాల వెలుగుతో అపహాస్యం చేస్తున్న వానివలె, ఎర్రని పాదకాంతితో మహిషాసురుని పట్ల అధిక కోపాన్ని చూపుతున్న వానివలె ఉన్న మీ పాదం మమ్మల్ని రక్షించుగాక. (మహిషాసురుని వలె తనలో కూడా అసంఖ్యాకమైన దోషాలున్నాయని గుర్తించిన భక్తుడు, అమ్మవారి పాదాలలో ప్రదర్శించబడిన కోపం తనపైకి రానీయవద్దని ప్రార్థిస్తున్నాడు.)

---

శ్లోకం 47 (11-12-22)

శార్దూలవిక్రీడితము

క్షిప్రందేవి! శిరస్పందనే మహిషం పిష్ట్వా తతోఽధః పదం

దిత్సంత్యాంత్వయి కంఠభంజనభియా కంఠీరవే విద్రుతే .

మేదిన్యామపి భీతికంపితతనౌ ప్రేమత్వరాశాలినా

శర్వేణైవనిజాంకసీమ్ని నిహితం పాదద్వయం తే జయేత్ .. 47..

ప్రతిపదార్థం:

దేవి = ఓ పార్వతీ దేవీ!, మహిషం = మహిషాసురుని, శిరస్పందనే = తల ఎగరవేసిన పొగరుబోతు కదలికలను, పిష్ట్వా = నలిపివేసి, తతః = అటుపిమ్మట, అధఃపదం = నీ పాదాలను ఉంచడానికి కింది స్థలాన్ని, దిత్సంత్యాం = వెతుకుతుండగా, త్వయి = నీవు, కంఠభంజనభియా = నీ పాదాలచే మెడ తెగిపోతుందనే భయంతో, కంఠీరవే = నీ వాహనమైన సింహం, విద్రుతే = భయంతో వేగంగా వెళ్లిపోయింది, మేదిన్యామ్+అపి = భూమి కూడా, భీతికంపితతనౌ = భయంతో కంపించిన తనువు కలదికాగా, ప్రేమత్వరాశాలినా = చాలా ప్రేమతో, త్వరగా, శర్వేన+ఏవ = శివుడు మాత్రమే, నిజ+అంకసీమ్ని = తన ఒడిలో, తే = నీ, పాదద్వయం = రెండు పాదాలను, క్షిప్రం = వేగముగా, నిహితం = ఉంచాడు, జయేత్ = అటువంటి నీ పాదాలకు ఎప్పుడూ జయము కలుగు గాక!

తాత్పర్యము:

మహిషాసురమర్దినీ! నీవు మహిషాసురుని తలపై నీ పాదములనువేసి త్వరగా నలిపివేసావు. ఆ తరువాత నీ పాదాలను ఉంచడానికి స్థలం కోసం వెతికావు. అయితే, నీ వాహనమైన సింహం మీ పాదాలచే మెడ తెగిపోతుందనే భయంతో వేగంగా వెళ్లిపోయింది. భయంతో భూమి కూడా కంపించింది. ఆ సమయంలో, శివుడు చాలా ప్రేమతో తన ఒడిలో నీ రెండు పాదాలను వేగంగా ఉంచాడు. అటువంటి నీ పాదాలకు ఎప్పుడూ జయము కలుగు గాక!

---

శార్దూలవిక్రీడితము

పూర్వందేవి! పదాంబుజేన మహిషప్రధ్వంసనాభ్యాసతః

పశ్చాత్కుత్సితసుంభదైత్యవిజయోఽప్యేవంకృతః కిం త్వయా? .

నో చేద్భాతి కథం కుసుంభవిజయీ పాదాబ్జదేశోఽయమి-

త్యాలాపేగిరిశస్య తద్విజయతే మందస్మితం దేవి! తే .. 48..

ప్రతిపదార్థం:

దేవి! = ఓ పార్వతీదేవి!, పూర్వం = పూర్వము, పద+అంబుజేన = నీ కమల పాదాలతో, మహిష ప్రధ్వంసన = మహిషాసుర సంహారాన్ని, అభ్యాసతః = సాధన చేసిన (అభ్యసించిన), పశ్చాత్ = పిమ్మట, కుత్సిత = దుష్టుడైన, సుంభ దైత్యవిజయః+అపి = శుంభ రాక్షసుని విజయము కూడా, ఏవం కృతః = అదే పద్ధతిలో, త్వయా కిం = నువ్వు జయించావా ఏమి?, నో చేత్ = లేకపోతే, అయమ్ = ఈ, పాద+అబ్జదేశః = పాదపద్మ ప్రదేశము, కుసుంభవిజయీ = కుసుంభ పుష్పమును జయించిన ప్రకాశముతో (దుష్టుడైన శుంభ రాక్షసుని విజయముతో అని శ్లేష), కథం = ఎట్లు, భాతి = ప్రకాశిస్తున్నాయి, ఇతి+ఆలాపే = అని సరసంగా మాట్లాడుచున్న, గిరిశస్య = శివుని చూసి, తే = నువ్వు, మందస్మితం = మృదువుగా నవ్వుతావు, తత్+విజయతే = ఆ చిరునవ్వు విజయముగా మమ్ములను రక్షిస్తూ ప్రకాశిస్తున్నది.

తాత్పర్యము:

"దేవీ! నువ్వు ఇంతకు ముందు మహిషాసుర సంహారాన్ని నీ కమల పాదాలతో అభ్యసించావు. దుష్టుడైన శుంభుని కూడా అదే పద్ధతిలో జయించావా? లేకపోతే, నీ పాదాలు ప్రకాశంలో కుసుంభ పుష్పాన్ని ఎలా జయించాయి?" అని శివుడు ఈ పంథాలో మాట్లాడుతున్నప్పుడు, నువ్వు మృదువుగా నవ్వుతావు. ఆ చిరునవ్వు విజయముగా మమ్ములను రక్షిస్తూ ప్రకాశిస్తున్నది.

---

శార్దూలవిక్రీడితము

బిభ్రాణేనమనోజ్ఞయావకరసం మంజుధ్వనన్నూపుర-

శ్లేషాలంకృతిశాలినానఖమణీజాతప్రసాదశ్రియా .

ఏకేనైవపదేన దేవి! మహిషధ్వంసే మహీయస్తరః

శ్లోకోయంరచితస్త్వయేతి విబుధాః సంశ్లాఘనం కుర్వతే .. 49..

ప్రతిపదార్థం:

దేవి! = ఓ పార్వతీదేవీ!, మనోజ్ఞ = మనోహరమైన, యావకరసం = ఎర్రని లాక్షారసమును (అందెకు పూసే రంగు), బిభ్రాణేన = వహించుటచేత, మంజుధ్వనత్ = అందముగా మ్రోగుచున్న, నూపుర = కాలి అందెల, శ్లేష = కలయికచే, అలంకృతి = అలంకారము కలిగినదై, నఖమణీజాతప్రసాదశ్రియా = గోర్లు అను ముత్యాల తెల్లటి మెరుపుల ఐశ్వర్యము కలిగిన, అయం = ఈ, ఏకేన+ఏవ పదేన = ఒకే ఒక పాదముతో, త్వయా = నీ చేత, మహిషధ్వంసే = మహిషాసురుడిని నాశనం చేయడం ద్వారా, మహీయస్తరః శ్లోకః = చాలా గొప్ప కీర్తి (శ్లోకం), రచితః ఇతి = సంపాదించుకొనబడినదని, విబుధాః = పండితులు, సంశ్లాఘనం = పొగడ్తను, కుర్వతే = చేయుచున్నారు.

తాత్పర్యము:

ఓ పార్వతీదేవీ! ఎక్కడైనా లోకంలో బహు పాదాలు కలిగిన శ్లోకం రచించి ఎవరైనా కీర్తి సంపాదించుకుంటారు. కాని నువ్వు ఒక్క పాదంతో (కాలిపాదం/పద్యపాదం) అమోఘమైన శ్లోక రచన చేశావని పండితులు నిన్ను పొగుడుతున్నారు. (నీ పాదం మహిషుని సంహరించి గొప్ప కీర్తిని పొందిందని, ఆ పాదమునే కవి శ్లోకంగా వర్ణించాడని భావం.)

---

శార్దూలవిక్రీడితము

త్వంశంభోర్మహిషీ భవస్యగసుతే! తేనోపహాసాయ తే

దైత్యోఽయాంమహిషీభవన్నుపగతః, సోఽయం కథం క్షమ్యతే ? .

ఇత్థంనూపురనిఃస్వనైరివ వదన్ పాదస్త్వదీయో రుషా
శస్త్రప్రగ్రహణాత్పురైవమహిషం పిష్టన్ పరిత్రాయతాం .. 50..
ప్రతిపదార్థం:
అగసుతే = పర్వతరాజైన హిమవంతుని పుత్రీ!, త్వం = నువ్వు, శంభోః+మహిషీ = శివుని భార్యవు (పట్టపురాణి), భవసి = అగుదువు, తేన = ఆ కారణముచేత, తే = నిన్ను, ఉపహాసాయ = పరిహాసము చేయుట కొరకు, అయం దైత్యః = ఈ రాక్షసుడు, మహిషీభవన్ = మహిషరూపాన్ని (దున్నపోతు రూపాన్ని), ఉపగతః = పొందాడు, సః+అయం = అతడు, కథం = ఎట్లు, క్షమ్యతే = క్షమించబడతాడు?, ఇత్థం = అని, నూపురనిఃస్వనైః = కాలి అందెల మ్రోతతో, వదన్+ఇవ = చెప్పుచున్నదానివలె, త్వదీయః పాదః = నీ పాదము, రుషా = రోషముతో, శస్త్రప్రగ్రహణాత్+పురైవ = (నీ చేయి) ఆయుధాన్ని పట్టుకోకముందే, మహిషం = ఆ మహిషాసురుని, పిష్టన్ = సంహరించింది, పరిత్రాయతాం = ఆ శ్రీ పాదము మమ్మల్ని రక్షించుగాక!
తాత్పర్యము:
పర్వతరాజైన హిమవంతుని పుత్రీ! నువ్వు శివుని మహిషివి (పట్టపురాణి). ఆ కారణముచేత, నీ హోదాలో 'మహిష' అను పదమున్నది కనుక నిన్ను గేదెగా (బర్రె) భావించి, నిన్ను ఎగతాళి చేయుట కొరకు ఆ రాక్షసుడు దున్నపోతయ్యాడు. "ఇలా నిన్ను ఎగతాళి చేసిన వాడు ఎలా క్షమించబడతాడు?" అని నీ పాదము నీ కాలి అందెల మ్రోతతో చెబుతూ - రోషముతో నీ చేయి ఆయుధాన్ని పట్టుకోకముందే - ఆ మహిషాసురుని, నీ పాదం నలిపివేసింది. ఆ నీ శ్రీపాదము మమ్మల్ని రక్షించుగాక!

---

శార్దూలవిక్రీడితము
దేవ్యాపంకశయోఽద్య కోఽపి మహిషచ్ఛద్మా మహాన్ కంటకః
పాదేనాహతఇత్యుదూఢహసితం సఖ్యా సమావేదితే .
సద్యఃకంటకశాలినా కరతలేనాసాద్య పాదాంబుజం
గృహ్ణన్నార్తివినోదనాయగిరిశో జీయాత్ప్రియస్తే శివే! .. 51..
ప్రతిపదార్థం:
శివే = శాంకరీ!, దేవ్యా = దేవియొక్క, పంకశయః = పాద పద్మము (బురదలో పుట్టే పద్మం), అద్య = ఇప్పుడు, కః+అపి = ఒకానొక, మహాన్ మహిషత ఛద్మా = గొప్పదైన, మోసపూరితమైన మహిష రూపంలో ఉన్న, కంటకః = ముల్లును (శరీరావయవములలోనికి పోవునది / క్షుద్రశత్రువు), పాదేన+ఆహతః = తన పాదముచే కొట్టింది, ఇతి = అని, ఉదూఢహసితం = దట్టమైన చిరునవ్వుతో, సఖ్యా = మీ పరిచారకులచే, సమావేదితే = తెలుపబడగా, సద్యః = వెంటనే, కంటకశాలినా = కంటకములు తీయుటలో నేర్పరి అయిన, తే = నీయొక్క, ప్రియః = ప్రియుడైన, గిరిశః = శివుడు (పర్వతమున ఉండువాడు), కరతలేన = అరచేతితో, పాద+అంబుజం = పాదపద్మమును, ఆసాద్య = పొంది, ఆర్తివినోదనాయ = బాధ పోగొట్టుట కొరకు, గృహ్ణన్ = నీ పాద పద్మమును పైకి లేవనెత్తాడు, జీయాత్ = ఆ చేష్ట జయింపబడుగాక!
తాత్పర్యము:

శాంకరీ! "దేవియొక్క పాద పద్మము ఒకానొక, మహిష రూపంలో ఉన్న ముల్లును తన పాదముచే కొట్టింది" అని నీ చెలులు దట్టమైన చిరునవ్వుతో శివునికి చెప్పారు. వెంటనే కంటకములు తీయుటలో నేర్పరి అయిన, నీ ప్రియుడైన శివుడు, అరచేతితో, బాధ పోగొట్టుట కొరకు నీ పాద పద్మమును పైకి లేవనెత్తాడు. ఆ చేష్ట జయింపబడుగాక!

---

శార్దూలవిక్రీడితము

త్వత్పాదాంగులిపల్లవైరగసుతే!దేవి! స్వయం పంచభిః

పంచత్వంగమితో మహాసుర ఇతి స్వాత్మానురూపం కృతం

ఏతైరేవనతో జనస్త్రిదశతాం నీతో, మహేశః పున-

ర్లక్షత్వంగమితః ప్రసూనధనుషో విస్మాపనం తద్ద్వయం .. 52..

ప్రతిపదార్థం:

అగసుతే! = హిమవంతుని పుత్రీ!, దేవి! = పార్వతీదేవి!, త్వత్ = నీయొక్క, పద+అంగులిపల్లవైః పంచభిః = పాదముల అయిదు వేళ్ల చిగురులతో, స్వయం = స్వయముగా, మహా+అసురః = మహారాక్షసుడైన మహిషాసురుడు, పంచత్వం = పంచభూతములలో కలిసి పోవు స్థితికి (మరణము), గమితః = పంపబడ్డాడు, ఇతి = ఇట్లు (ఇదేవిధంగా), స్వ+ఆత్మ+అనురూపం = వాటిలాగే (పంచభూతాలవలె) అవే రూపాలను, కృతం = చేయబడ్డాడు (పొందాడు), ఏతైః+ఏవ = మీ పాదాలయొక్క అదే వేళ్లవలననే, నతః జనః = నిన్ను పూజించే వ్యక్తులు, త్రిదశతాం = ఎప్పుడూ మూడు పదుల వయస్సులో ఉండేవారిలా (దేవతలలా), నీతః = తేబడతారు, పునః = మరలా, మహేశః = శివుడు కూడా, ప్రసూనధనుషః = పుష్పబాణుని (మన్మథుని), లక్షత్వం గమితః = లక్ష్యమయ్యాడు (లక్ష ఆనందాలకు దారితీసే మన్మథుని లక్ష్యమయ్యాడు), తత్+ద్వయం = ఈ రెండు కూడా (నీ పాదాల జంట), విస్మాపనం = ఆశ్చర్యము కల్గించునది.

తాత్పర్యము:

హిమవంతుని పుత్రీ! పార్వతీదేవి! నీయొక్క పాదముల అయిదు వేళ్ల చిగురులతో మహారాక్షసుడైన మహిషాసురుడు పంచభూతములలో కలిసిపోయాడు. వాటిలాగే (పంచభూతాలవలె) అవే రూపాలను పొందాడు. మీ పాదాలయొక్క అదే వేళ్లను పూజించే వ్యక్తులు ఎప్పుడూ మూడు పదుల వయస్సులో ఉండే దేవతలలా ఆశీర్వదించబడతారు. శివుడు కూడా నీ అయిదు వేళ్ల స్పర్శతో లక్ష ఆనందాలకు అనగా అసంఖ్యాక ఆనందాలకు దారితీసే మన్మథుని లక్ష్యమయ్యాడు. నీ పాదాల జంట ఆశ్చర్యము కల్గించునది.

---

శార్దూలవిక్రీడితము

బ్రాహ్మంమాఘవనం చ వాహనమహో మంద్వైర్గతైర్నిందితం

ధావల్యేననఖత్విషాం విహసితో వాహోఽపి మాహేశ్వరః .

ఇత్థంవాహనవైరితాం భజతి తే పాదస్తతోమన్మహే

కాత్యాయన్యమునాన్యఘాని మహిషః కార్తాంతవాహభ్రమాత్ .53..

ప్రతిపదార్థం:

అహో = ఆశ్చర్యార్థకము, ఔరా!, కాత్యాయని = కత్యుడను ఋషికి కూతురివలె ఉండుదానా! పార్వతీదేవీ!, బ్రాహ్మం = బ్రహ్మ సంబంధమైన వాహనము (హంస), మాఘవనం చ వాహనమ్ = ఇంద్ర సంబంధమైన వాహనము (ఐరావతం) కూడా,

మంద్రైః గతైః = నెమ్మదిగా నడవడం వల్ల, నిందితం = నిందితమయ్యాయి (ఓడిపోయాయి), ధావల్యేన = మీ పాదాల తెలుపు (తేజస్సుతో), నఖ త్విషాం = గోర్ల తేజస్సుతో (తూగలేక), మాహేశ్వరః వాహః+అపి = శివుని వాహనమైన నంది కూడా, విహసితః = అపహాస్యం పాలైంది, ఇత్థం = ఈవిధంగా, తే పాదః = నీ పాదము, వాహనవైరితాం = ఇతర వాహనాల పట్ల శత్రుత్వాన్ని, భజతి = కలిగి ఉంటుంది, తతః = అందువలన, మహిషః = మహిషాసురుడిని, అమునా కార్తాంతవాహభ్రమాత్ = ప్రాణుల దేహనాశము చేయు యముని వాహనమైన దున్నపోతు యొక్క భ్రమవలన, న్యఘాని = చంపబడ్డాడని, మన్మహే = నేను తలంతును.

తాత్పర్యము:

ఔరా! కత్యుడను ఋషికి కూతురివలె ఉండుదానా! పార్వతీదేవీ! బ్రహ్మ సంబంధమైన వాహనము (హంస), ఇంద్ర సంబంధమైన వాహనము (ఐరావతం) నెమ్మదిగా నడవడం వల్ల నీ పాదాలతో తూగలేక ఓడిపోయాయి. నీ పాదాలయొక్క తెల్లని గోర్ల తేజస్సుతో తూగలేక శివుని వాహనమైన నంది కూడా అపహాస్యం పాలైంది. ఈవిధంగా నీ పాదము ఇతర వాహనాల పట్ల శత్రుత్వాన్ని కలిగి ఉంటుంది. అందువలన నీ శ్రీపాదము చేత మహిషాసురుడిగా అవతరించిన రాక్షసుడు, యముని వాహనమైన దున్నపోతు యొక్క గందరగోళంతో చంపబడ్డాడని మేము భావిస్తున్నాము. (మహిషాసురుడు దున్నపోతు రూపంలో వచ్చాడు కాబట్టి - శ్రీ పాదము తన వాహన శత్రువైన యమ వాహనమైన దున్నపోతుగా - మహిషాసురుని భావించి చంపినదని కవి చమత్కారం.)

---

శార్దూలవిక్రీడితము

సీమంతప్రకరేసురేంద్రసుదృశాం సిందూరరేఖాత్మనా

మాణిక్యద్యుతిసంజ్ఞయైవమకుటీకోటీషు దైత్యద్రుహాం .

శంభోర్మూర్ధ్ని జటాఘటారుణరుచివ్యాజేన పాదప్రభై-

వైకాతే పరిణామమేతి కరుణామూర్తే! గిరీంద్రాత్మజే!54

ప్రతిపదార్థం:

గిరీంద్ర+ఆత్మజే! = హిమవంతుని పుత్రీ! పార్వతీ!, కరుణామూర్తే = దయాస్వరూపిణీ!, సీమంతప్రకరే సుర+ఇంద్రసుదృశాం = చక్కని చూపులు కలిగిన స్వర్గలోక స్త్రీల యొక్క పాపిట సమూహములో, సిందూరరేఖాత్మనా+ఇవ = కుంకుమువంటి ఎర్రని పాడిగా, దైత్యద్రుహాం = రాక్షసుల శత్రువులైన దేవతల, మకుటీకోటీషు = కిరీటాల అంచున, మాణిక్య ద్యుతి సంజ్ఞయా+ఇవ = మాణిక్య కాంతి గుర్తు వలె, శంభోః+మూర్ధ్ని = శివుని తలపై ఉన్న, జటాఘట = జడల సమూహమునకు (జటాజూటమునకు), అరుణరుచి వ్యాజేన ఇవ = ఎరుపు రంగు సాకును జోడించుచున్నదానివలె, తే = నీయొక్క, పాదప్రభా = పాదముల కాంతి, ఏకా = ఒకటి అయినప్పటికీ, పరిణామమ్+ఏతి = అనేక పరిణామములను (రూపములను) పొందుచున్నది.

తాత్పర్యము:

హిమవంతుని పుత్రీ! పార్వతీ! దయాస్వరూపిణీ! నీయొక్క ఎర్రని పాదముల కాంతి ఒకటే అయినప్పటికీ, స్వర్గలోక స్త్రీల యొక్క పాపిట సమూహములో కుంకుమ వంటి ఎర్రని పాడిగా, దేవతల కిరీటాల అంచున, మాణిక్య కాంతి గుర్తు వలె, నీ పాదాలకు నమస్కరించు శివుని జటాజూటమునకు ఎరుపు రంగు సాకును జోడించుచున్న దానివలె అనేక రూపములను పొందుచున్నది.

---

శార్దూలవిక్రీడితము

నో కేశః పరమాశ్రయః సుమనసాం,పాదాబ్జరేణుశ్చ తే

నో మందారసితా పరం స్మితరుచిర్మంజీరయోశ్చ ద్వయీ .

నో బాహుః కలహం సమేత్య జయతి,త్వద్యానలీలాప్యసౌ

నో శుంభత్తరలాక్షమాననమిదం, పాదాంబుజం చాంబికే! .. 55..

ప్రతిపదార్థం:

అంబికే = తల్లీ! పార్వతీ!, తే = నీ, కేశః = కేశము మాత్రమే, సుమనసాం = పువ్వులకు (మంచి మనస్సు కలవారికి), పరమ+ఆశ్రయః న = పరమాశ్రయం కాదు (శ్రేష్ఠమైన ఆశ్రయం కాదు), పాద+అబ్జరేణుః+చ = పాద కమలధూళి కూడా, (తే) స్మితరుచిః = నీ చిరునవ్వు యొక్క కాంతి మాత్రమే, మందారసితా+అపరం న = కేవలము తెల్లని వర్ణము కలిగిన మందారమను కల్పవృక్షము కంటే శ్రేష్ఠమైనది కాదు, ద్వయీ = నీ రెండు, మంజీరయోః చ = తెల్లని నూపురములు కూడా, అసౌ బాహుః = నీ చేయి మాత్రమే, కలహం సమేత్య జయతి న = యుద్ధంలో విజయం సాధించేది కాదు, త్వత్+యానలీలా+అపి = నీ నడక కూడా (కలహంసలను సమీపించి), ఇదం ఆననమ్ = నీ ముఖం మాత్రమే, శుంభత్+తరల+అక్షమ్ న = ప్రకాశిస్తూ చంచలంగా కదులుతుండే కళ్ళతో ఆనందం గొలుపదు, పాద+అంబుజం చ = నీ పాదపద్మము కూడా (ఎరుపు లక్కతో ప్రకాశించునది).

తాత్పర్యము:

అమ్మా! పార్వతీ! నీ కేశము సుమనస్సులకు (పువ్వులకు) పరమాశ్రయం. నీ పాద కమల ధూళి కూడా సుమనస్సులకు (మంచివారికి) ఆశ్రయం. నీ చిరునవ్వు యొక్క కాంతి, మందారమను కల్పవృక్షము కంటే శ్రేష్ఠమైనది (మందారసిత). నీ పాదాలకున్న మెల్లగా మ్రోగెడి తెల్లని నూపుర ధ్వనులు శ్రేష్ఠమైనవి (మందా+రసిత). నీ చేయి యుద్ధంలో (కలహం+సమేత్య) మాత్రమే విజయం సాధించడమే కాదు, నీ నడక కూడా అందంతో హంసలను సమీపించి (కలహంసమ్+ఏత్య) వాటి పై విజయం సాధించింది. మీ ముఖం చంచలమైన కళ్లతో (శుంభత్తరల+అక్ష) మెరిసిపోవడమే కాకుండా అందంగా ఉంటుంది. మీ కమల పాదం కూడా ఎరుపు లక్కతో (శుంభత్తర-లక్ష) అందంగా ప్రకాశిస్తుంది.

---

శార్దూలవిక్రీడితము

నాథే!తావకవాహసింహచకితాస్త్వత్పాదమూలేనతా

నూనంబభ్రమురభ్రముప్రియముఖా దిక్కుంభివీరాశ్చిరం .

నోచేదేషకథం తదున్నతశిరస్సిందూరసందోహజో

రాగస్తేచరణాంబుజే పరిణమన్నద్యాపి విద్యోతతే 56

ప్రతిపదార్థం:

నాథే! = విశ్వేశ్వరీ!, తావకవాహ = నీ వాహనమైన, సింహచకితాః = సింహానికి భయపడి, అభ్రముప్రియముఖా = అభ్రము యొక్క పతి అయిన ఐరావతమువంటి దిగ్గజములు, చిరం = చాలా కాలము, త్వత్+పాదమూలే = నీ పాద మూలముల దగ్గర, నతాః = నమస్కరించి, బభ్రముః = శరణుకోరుతూ పరిభ్రమించాయి (దొర్లాయి), నూనం = ఇది నిశ్చయము (సత్యము), నోచేత్ = లేకపోయినచో, తత్+ఉన్నతశిరస్ = ఆ ఏనుగుల ఎత్తైన తలల నుండి వెలువడే, సిందూరసందోహజః

= ఎర్రటి ద్రవ రాశి నుండి వెలువడే, ఏషః = ఈ, రాగః = ఎరుపు రంగు, తే = నీ, చరణ+అంబుజే = పాద కమలాల వద్ద, అద్య+అపి = నేటికీ, పరిణమన్ = పరిణమిస్తూ (మారి), కథం = ఎట్లు, విద్యోతతే = ప్రకాశిస్తుంది?

తాత్పర్యము:

విశ్వేశ్వరీ! ఐరావతం (అభ్రముని సహచరుడు) వంటి ఎనిమిది ఏనుగులు నీ వాహనమైన సింహానికి భయపడి చాలా కాలం పాటు శరణుకోరుతూ నీ పాదాల వద్ద దొర్లాయి. లేకపోతే, ఆ ఏనుగుల ఎత్తైన తలల నుండి వెలువడే ఎరుపు రంగు నీ పాదకమలాల వద్ద నేటికీ ఎలా ప్రకాశిస్తుంది? (అమ్మవారి పాదాలు ఎర్రగా ఎందుకు ఉన్నాయనటానికి ఇదొక అందమైన ఊహ.)

---

శార్దూలవిక్రీడితము

త్వత్పాదోఽయమజాశ్రితశ్చరుచిరస్పర్శాన్వితో యోగినా-

మంతఃస్థాకృతిరూష్మభాక్చ మహిషప్రధ్వంసనప్రక్రమే .

ఏవంఖల్వఖిలాక్షరాత్మకమముం శైలేంద్రకన్యే! కథం

భాషంతేనతవర్గబంధుమపవర్గాలంబనంవా జనాః? .. 57..

ప్రతిపదార్థం:

శైల+ఇంద్రకన్యే! = హిమవంతుని పుత్రీ!, అయమ్ త్వత్+పాదః = ఈ నీ పాదము, అజ+ఆశ్రితః+చ = బ్రహ్మకు ఆశ్రితమైనది (అచ్చులకు ఆశ్రయమైనది), రుచిరస్పర్శ = చాలా మృదువైన స్పర్శతో (అందమైన హల్లులను కలిగి ఉంది), అన్వితః = కూడినది, యోగినామ్+అంతఃస్థ+ఆకృతిః = యోగులయొక్క హృదయాలలో ఉంది (అంతస్థ అక్షరాలయిన య, ర, ల, వ లను కలిగి ఉంది), మహిషప్రధ్వంసనప్రక్రమే = మహిషాసుర సంహార సమయంలో, ఊష్మభాక్ చ = శక్తివంతమైనది కూడా (ఊష్మాక్షరాలయిన శ, ష, స, హ లను కలిగి ఉంది), ఏవం = ఈ విధముగా, అముం = నీ శ్రీపాదము, అఖిల = అనేక విధాలుగా, అక్షరాత్మకమ్ = నిత్య ప్రకాశవంతంగా ఉన్నప్పుడు (వర్ణమాలలోని అన్ని అక్షరాలకు భాండాగారం అయినప్పుడు), జనాః = జనులు, కథం = ఎట్లు, భాషంతే = వర్ణిస్తారు, ఖలు = కదా!, నతవర్గబంధుమ్ = ఆరాధించే బంధువనియా (త వర్గ అక్షరాలకు బంధువు), అపవర్గ+ఆలంబనం వా? = ముక్తిదాత అనియా (ప వర్గ అక్షరాల సమూహం లేదని).

తాత్పర్యము:

హిమవంతుని పుత్రీ! ఈ నీ పాదము బ్రహ్మకు ఆశ్రితమైనది (లేదా అచ్చులకు ఆశ్రయమైనది); చాలా మృదువైన స్పర్శతో కూడినది (లేదా అందమైన హల్లులను కలిగి ఉంది); యోగుల హృదయాలలో ఉంది (లేదా అంతస్థ అక్షరాలయిన య, ర, ల, వ లను కలిగి ఉంది); ఇది మహిషాసుర సంహార సమయంలో శక్తివంతమైనది (లేదా ఊష్మాక్షరాలయిన శ, ష, స, హ లను కలిగి ఉంది). ఈవిధముగా నీ శ్రీపాదము అనేక విధాలుగా ఎప్పటికీ ప్రకాశవంతంగా ఉన్నప్పుడు (లేదా వర్ణమాలలోని అన్ని అక్షరాలకు భాండాగారం అయినప్పుడు), ప్రజలు దానిని ఎలా వర్ణిస్తారు? ఆరాధించే స్నేహితుడనియా (లేదా త వర్గ అక్షరాలకు బంధువనియా)? లేదా ముక్తి దాత అనియా (లేదా ప వర్గ అక్షరాల సమూహం లేదని)?

---

శార్దూలవిక్రీడితము

ఉన్మీలన్నఖమండలీహిమకణః,శోణప్రభాగైరికం

బిభ్రాణః,పరిశోభమానకటకో, భూయో వనైకాశ్రయః .

గాయత్సిద్ధవధూనిషేవితతలఃపాదస్త్వదీయః శివే!

రాజత్యేషహిమాద్రిపాదవదిదం యుక్తం హిమాద్రేః సుతే! .. 58..

ప్రతిపదార్థం:

హిమాద్రేః సుతే! = హిమవంతుని పుత్రీ!, శివే = శాంకరీ! శుభప్రదురాలా!, ఏషః త్వదీయః పాదః = ఈ నీయొక్క పాదము, హిమ+అద్రిపాదవత్ = హిమాలయాల పాదములా (అడుగుభాగములా), రాజతి = ప్రకాశిస్తుంది, ఇదం యుక్తం = ఇది యుక్తమైనదే, ఉన్మీలత్ = అద్భుతముగా వికసించిన, నఖమండలీ = నీ గోళ్ల వరుస, హిమకణః = మంచు బిందువుల వంటిది, శోణ = ఎర్రని పాదాల, ప్రభా = కాంతి, గైరికం = ఎర్రని గైరిక ధాతు శోభను, బిభ్రాణః = వహించుచున్నది, పరిశోభమాన = (నీ పాదం) బాగా శోభించుచున్న, కటకః = కటకమును (కడియమును / పర్వత మధ్యభాగమును) కలిగి ఉన్నది, భూయః = మరలా, వన+ఏక+ఆశ్రయః = సేవించువారికి ఒకే ఒక ఆశ్రయముగా పేరు పొందింది (వనములకు ఆశ్రయము), గాయత్ = గానం చేసే, సిద్ధవధూ = సిద్ధ స్త్రీలచే, నిషేవితతలః = చక్కగా కొలవబడిన చోటు కలది.

తాత్పర్యము:

హిమవంతుని పుత్రీ! శాంకరీ! శుభప్రదురాలా! నీ పాదం హిమాలయ పాదము వలె (అడుగు భాగమువలె) ప్రకాశిస్తున్నది. ఇది యుక్తమైనదే. ఎలా అంటే - హిమాలయ పాదములో (=అడుగు భాగములో) తెల్లని హిమ కణాలుంటాయి. నీ గోళ్ల వరుస తెల్లని మంచుబిందువుల వంటిది. హిమాలయ పాదములో (=అడుగు భాగములో) ఎర్రని గైరిక ధాతు శోభ ఉంటుంది. నీ పాదం కూడా పారాణితో ఎర్రగా మెరిసిపోతుంది. హిమాలయ పాదము (=అడుగు భాగము) బాగా శోభించుచున్న కటకమును (=పర్వత మధ్యభాగమును) కలిగి ఉన్నది. నీ పాదం కూడా కటకమును (=కడియమును) కలిగి ఉన్నది. హిమాలయ పాదము (=అడుగు భాగము) వనైకాశ్రయము (=వనములకు ఆశ్రయము). నీ పాదము కూడా వనైకాశ్రయము (=సేవించువారికి ఒకే ఒక ఆశ్రయముగా పేరు పొందింది). హిమాలయ పాదము (=అడుగు భాగము) దగ్గరికి, నీ పాదం దగ్గరికి గానం చేసే సిద్ధ స్త్రీలు తరచుగా వస్తుంటారు.

---

శార్దూలవిక్రీడితము

దిక్పాలైర్దశభిఃపృథక్పృథగయం త్వత్పాదయోరర్పితో

దృశ్యోభక్త్యనురాగ ఏవ దశధా శోణాంగులిశ్రీమిషాత్

.

పాదాభ్యామపితాన్ ప్రతి ప్రకటితా నూనం ప్రసాదాంకురా

దృశ్యంతేనఖకాంతిపంక్తిదశకవ్యాజేనశైలాత్మజే! .. 59

ప్రతిపదార్థం:

శైల+ఆత్మజే! = హిమవంతుని పుత్రీ! పార్వతీ!, దశభిః దిక్పాలైః = పదిమంది దిక్పాలకులచేత, పృథక్ పృథక్ = విడివిడిగా, త్వత్ పాదయోః అర్పితః = నీ పాదములకు అర్పించిన, భక్తిః+అనురాగః ఏవ = భక్తి మరియు అనురాగములు, దశధా = పది విధములుగా, శోణ = ఎర్రని, అయం అంగులిశ్రీమిషాత్ = ఈ కాలివేళ్ల వైభవమను మిషతో, దృశ్యః = స్పష్టంగా కనిపిస్తున్నది, పాదాభ్యామ్+అపి = నీ పాదాలు కూడా, తాన్ = వారి పట్ల, ప్రతిప్రకటిత = తిరిగి ప్రకటించిన, అనూనం =

పరిపూర్ణమైన, ప్రసాద+అంకురాః = దయ అనెడి మొగ్గలుగా, నఖకాంతిపంక్తిదశకవ్యాజేన = పది గోళ్ల వరుసలోని తేజస్సు అను మిషతో, దృశ్యంతే = స్పష్టంగా కనిపిస్తాయి.

తాత్పర్యము:

హిమవంతుని పుత్రీ! పార్వతీ! పదిమంది దిక్పాలకులచేత విడివిడిగా నీ పాదములకు అర్పించిన భక్తి మరియు అనురాగములు పది విధములుగా ఎర్రని ఈ కాలివేళ్ల వైభవమను మిషతో స్పష్టంగా కనిపిస్తున్నది. నీ పాదాలు కూడా వారి పట్ల తిరిగి ప్రకటించిన దయ మొగ్గలుగా మారి పది గోళ్ల వరుసలోని తేజస్సు అను మిషతో స్పష్టంగా కనిపిస్తున్నది.

---

శార్దూలవిక్రీడితము

మేఘానాంకులిశస్య చాప్రతిహతా ధారాః క్రమంతాం చిరం

నో నశ్యేన్మదదానవారివిభవో నాకస్య నాగస్య చ .

పుత్రోఽయంమమ సైనికాశ్చ దధతాం నిత్యం జయంతః సుఖం

త్వత్పాదాంబుజపాతినఃసురపతేరిత్థం జయంత్యర్థనాః .. 60..

ప్రతిపదార్థం:

మేఘానాం = మేఘాల నుండి కురుస్తున్న, ధారాః = నీటి ధారలు, కులిశస్య చ = నా వజ్రాయుధం యొక్క, ధారాః = ధారలు (వాడి అంచులు), చిరం = అన్ని సమయాలలో, అప్రతిహతాః = నిరోధింపబడనివై, క్రమంతాం = ఉండుగాక!, నాకస్య = స్వర్గము యొక్క, మదదానవారివిభవో = సంతోషముతో చేసే దానజలముల యొక్క వైభవములు, నాగస్య చ = నా ఏనుగయిన ఐరావతం యొక్క, మదదానవారివిభవో = మదమెక్కిన దానమనబడు చెక్కిళ్ల మదజలములు, నశ్యేత్ న = ఎప్పుడూ నశింపబడకుండా ఉండుగాక!, అయం పుత్రః = ఈ నా కుమారుడు, జయంతః = జయంతునకు, సుఖం = సుఖము, దధతాం = ఇవ్వబడుగాక!, నిత్యం = ఎప్పుడూ, మమ సైనికాః చ = నా సైనికులకు కూడా, జయంతః = జయశీలత్వము, దధతాం = ఇవ్వబడుగాక!, త్వత్ = నీ, పాద+అంbuజపాతినః = పాదకమలాలకు నమస్కారము చేసిన, సురపతేః = ఇంద్రునియొక్క, ఇత్థం = ఈ ప్రార్థనలు, అర్థనాః = కోరికలు కోరేవారికి, జయంతి = జయం కలుగచేయుచున్నవి.

తాత్పర్యము:

"పార్వతీదేవీ! మేఘాలనుండి కురుస్తున్న నీటి ధారలు, నా వజ్రాయుధం యొక్క ధారలు (వాడి అంచులు) అన్ని సమయాలలో నిరోధింపబడనివై ఉండుగాక! స్వర్గములో సంతోషముతో చేసే దానజలముల యొక్క వైభవములు, నా ఏనుగయిన ఐరావతం యొక్క మదమెక్కిన దానమనబడు చెక్కిళ్ల మదజలములు ఎప్పుడూ నశింపబడకుండా ఉండుగాక! ఈ నా కుమారుడు జయంతునకు సుఖము ఎప్పుడూ ఇవ్వబడుగాక! ఎప్పుడూ నా సైనికులకు కూడా జయశీలత్వము ఇవ్వబడుగాక! నీ పాదకమలాలకు నమస్కారము చేసిన ఇంద్రునియొక్క పైన చెప్పిన ప్రార్థనలు కోరికలు కోరేవారికి జయం కలుగచేయుచున్నవి."

శార్దూలవిక్రీడితము

ఆజ్యాసక్తకరైర్ద్విజన్మభిరహంహూయేయ, నో దానవైః

స్వాహారోచితమస్తుపార్శ్వమనిశం, తాదృక్ చ హవ్యం మమ.

రక్షావానితిభూతిమానితి చ మే శబ్దప్రసిద్ధ్యా

నోపేక్ష్యోఽహమితిత్వదంఘ్రినమనే జీయాసురగ్నేర్గిరః .. 61..

---

ప్రతిపదార్థము

శివే! = శాంకరీ! శుభప్రదురాలా! పార్వతీదేవీ!, ఆజ్య+ఆసక్త కరైః = నేతిలో ముంచిన చేతులతో జ్ఞానోదయం పొందిన, ద్విజన్మభిః = బ్రాహ్మణులచే, అహం హూయేయ = నేను హోమము చేయుదును, ఆజి+ఆసక్త కరైః = యుద్ధమునందు ఆసక్తి కలిగిన, దానవైః = రాక్షసుల చేత, న = కాదు. అనిశం = ఎల్లప్పుడు, పార్శ్వమ్ = నా బాహువు, స్వాహోరోచితమ్ = స్వాహా చేత (దేవతలకు హవిస్సును అహుతి చేసేటప్పుడు చెప్పే మాట, అగ్ని భార్య) ప్రకాశవంతంగా, అస్తు = ఉండుగాక! (అలా చేయమని అమ్మవారికి ప్రార్థన) స్వ+ఆహార+ఉచితమ్ = నాకు సంబంధించిన ఆహారముతో, న = కాదు. తాదృక్ = అదేవిధంగా, మమ = నాకు, హవ్యం చ = దేవతలకీయదగిన అన్నము కూడా (స్వాహా చేత ప్రకాశవంతంగా నేను ఉన్నప్పుడు లభింపనివ్వు). రక్షావాన్+ఇతి = రక్షకుడిని అని, చ = మరియు, భూతిమాన్+ఇతి = నేను ధనవంతుడను అని, మే = నాకు కలిగిన, శబ్దప్రసిద్ధ్యా = పద ప్రసిద్ధితో, అహమ్ న+ఉపేక్ష్యః = నేను నీచేత విస్మరింపబడదగినవానిని కాను, ఇతి = అని, త్వత్+అంఘ్రినమనే = మీ శ్రీపాద కమలమును పూజిస్తూ చెప్పిన, అగ్నేః = ఆగ్నేయ దిశకు సంరక్షకుడు అయిన అగ్ని యొక్క, గిరః = మాటలు, జీయాసుః = జయింపబడుగాక (నీచేత మన్నింపబడుగాక!).

తాత్పర్యము

శాంకరీ! శుభప్రదురాలా! పార్వతీదేవీ! మీ శ్రీపాద కమలం (ఆగ్నేయ దిశకు సంరక్షకుడు) వద్ద పూజిస్తూ అగ్నిదేవుడు ఈ విధంగా ప్రార్థిస్తున్నాడు:

"నెయ్యిలో ముంచిన చేతులతో జ్ఞానోదయం పొందిన బ్రాహ్మణులచే నేను హోమఫలము పొందుదును, యుద్ధమునందు ఆసక్తి కలిగిన రాక్షసుల చేత కాదు. ఎల్లప్పుడు నా బాహువు స్వాహా చేత ప్రకాశవంతంగా ఉండుగాక! నాకు సంబంధించిన ఆహారముతో కాదు. అదేవిధంగా, నాకు దేవతలకీయదగిన అన్నము కూడా స్వాహా దేవిచేత ప్రకాశవంతంగా నేను ఉన్నప్పుడు లభింపనివ్వు. 'రక్షకుడిని అని, ధనవంతుడనని అను పద ప్రసిద్ధి కలిగిన నేను నీచేత విస్మరింపబడదగినవానిని కాను' (వీడికి వీడే రక్షించుకొంటాడు కదా! వీడిని నేను రక్షించేదేమిటి? అలాగే అగ్ని స్వయంగా ధనవంతుడని పేరు పొందాడు కదా? ప్రత్యేకంగా నేను ఇచ్చే ధనమేమున్నది? అని నిర్లక్ష్యం చేయవద్దని అమ్మవారికి అగ్ని విన్నపం చేస్తున్నాడు.)"

అని మీ శ్రీపాద కమలమును పూజిస్తూ చెప్పిన ఆగ్నేయ దిశకు సంరక్షకుడు అయిన అగ్ని యొక్క మాటలు నీచేత మన్నింపబడుగాక! (రక్షవాన్= రక్షకుడు కలిగినవాడు, భూతిమాన్= భస్మము కలిగినవాడిని అయిన నేను నీచేత విస్మరింపబడదగిన వానిని కాను అని రెండవ అర్థం).

విశేషములు

ఈ శ్లోకంలో భట్టాత్రి శ్లేషను అద్భుతంగా ప్రయోగించారు, ముఖ్యంగా 'ఆజ్యాసక్త కరైః' మరియు 'స్వాహారోచితం' వంటి పదాలలో. అగ్నిదేవుడు తన స్వంత వైభవాన్ని పేర్కొంటూనే, అమ్మవారి దయ కోసం ప్రార్థించడం ఒక కవి సమయం.

---

శార్దూలవిక్రీడితము

త్వత్భక్తాఘమబుద్ధిపూర్వలిఖితంస్యాచ్చేత్క్షమేథాః శివే!

కాంతస్తేమయి రోషవాన్, కురు పునస్తస్యార్ధభావం శనైః .

దేవిత్వం మహిషాభిహంత్రి! చకితం త్రాయస్వ మే వాహనం",
కాలస్యేతిజయంతి తే పదనతౌ లోలస్యసంప్రార్థనాః .. 62..

---

ప్రతిపదార్థము

శివే! = దేవీ! పార్వతీ!, త్వత్+భక్త+అఘమ్ = నీ భక్తుల పాపాలు, అబుద్ధిపూర్వలిఖితం స్యాత్+చేత్ = అబుద్ధిపూర్వకముగా (తన మనస్సులో ఇష్టం లేకుండా పొరబాటున) మా చిత్రగుప్తుడు వ్రాసి ఉంటే, క్షమేథాః = క్షమించండి. తే కాంతః = నీ భర్త శివుడు, మయి = నాయందు, రోషవాన్ = కోపంగా ఉన్నాడు, పునః = మరలా, శనైః = నెమ్మదిగా, తస్య = అతనికి, ఆర్ద్రభావం = నాపై శాంతభావాన్ని, కురు = కలుగజేయుము. దేవి! = దేవీ!, త్వం = నువ్వు, మహిష+అభిహంత్రి = మహిషాసుర (మహిష రూపంలో ఉన్న రాక్షసుడు) సంహారకురాలివి. చకితం = అందువలన భయపడుతున్న, మే వాహనం = నా వాహనమయిన మహిషాన్ని, త్రాయస్వ = రక్షించు. ఇతి = ఈ విధంగా, తే = నీ, పదనతౌ = పాదాలకు సాష్టాంగపడుటలో, లోలస్య = బాగా కోరిక కలిగిన, కాలస్య = యమునియొక్క, సంప్రార్థనాః = విశిష్ట ప్రార్థనలు, జయంతి = జయింపబడుచున్నవి.

తాత్పర్యము

దేవీ! నీ పాదాలకు సాష్టాంగ పడిన యముని ప్రార్థనలు ఇలా ఉన్నాయి:

"దేవీ! పార్వతీ! నీ భక్తుల పాపాలు తన మనస్సులో ఇష్టం లేకుండా పొరబాటున మా చిత్రగుప్తుడు వ్రాసి ఉంటే నన్ను క్షమించు. (మా చిత్రగుప్తుడు నీ భక్తుల పాపాలను తన చిట్టాలో వ్రాయడు. ఒకవేళ వ్రాసి ఉంటే క్షమించమని విన్నపం). నీ భర్త శివుడు నాపై కోపంగా ఉన్నాడు. దయచేసి ఆయనను నెమ్మదిగా శాంతింపజేయండి; (మార్కండేయుడు మొదలయిన వారి విషయంలో నా ప్రవర్తనకు శివుడు కోపంగా ఉన్నాడని క్షమింపచేయమని యముని ప్రార్థన). దేవీ! నువ్వు మహిషాసుర (మహిష రూపంలో ఉన్న రాక్షసుడు) సంహారకురాలివి. అందువలన భయపడుతున్న, నా వాహనమయిన మహిషమును రక్షించు. (మహిషాన్ని సంహరించావు కనుక తనను కూడా చంపుతావేమోనని తన వాహనమయిన మహిషము భయపడుతున్నదని దేవి దగ్గర యముని ఆవేదన. దున్నపోతుతో దేవతలను పూజిస్తారు కనుక దానికి మహిషమని పేరు వచ్చింది. 'మహంహతి పూజయతి దేవాన్ అనేన' అని వ్యుత్పత్తి.)"

ఈవిధంగా నీ పాదాలకు సాష్టాంగపడుటలో బాగా కోరిక కలిగిన యమునియొక్క విశిష్ట ప్రార్థనలు జయింపబడుచున్నవి (తప్పక ఫలిస్తాయని భావం).

విశేషములు

ఈ శ్లోకంలో యముడు తన దుర్భర పరిస్థితిని అమ్మవారికి వివరిస్తూ, తన వాహనమైన మహిషాన్ని కూడా రక్షించమని కోరడం ఒక ప్రత్యేక ఆకర్షణ. ఇది దేవి యొక్క సర్వవ్యాపకమైన కరుణను సూచిస్తుంది.

---

శార్దూలవిక్రీడితము

ధర్మాచారపరోఽహమిత్యవమతోరక్షోభిరేకాన్వయై-
ర్మహ్యాందేవి వినిందితా దిశమదుర్జాతిద్విషశ్చామరాః .
దైవాదిత్యుభయచ్యుతోవిశరణో రక్ష్యోఽహమిత్యాదయ-
స్త్వత్పాదప్రణతౌజయంతి నిరృతేరత్యాకులాః ప్రార్థనాః .. 63..

ప్రతిపదార్థము

దేవి! = ఓ దేవీ! పార్వతీ!, అహమ్ = నేను, ధర్మ+ఆచారపరః+ఇతి = ధర్మానికి మరియు దాని ఆచారానికి కట్టుబడి ఉన్నందున, ఏక+అన్వయైః = నా జాతికి చెందిన, రక్షోభిః = రాక్షసులచేత, అవమతః = అవమానింపబడ్డాను. జాతిద్విషః = శత్రు జాతి నుండి వచ్చిన నన్ను ద్వేషించే, అమరాః = దేవతలు, చ = కూడా, వినిందితాదిశమ్ = వేదాలచే అసహ్యించబడిన దారిద్ర్యము, అశుభము, కష్టములకు నెలవయిన దక్షిణ పశ్చిమముల మధ్యన వున్న నైరుతి దిక్కును, మహ్యం = నాకొరకు, అదుః = ఇచ్చిరి. దైవాత్ = పరమేశ్వరుని కోరికతో నా దురదృష్టం కారణంగా, ఇతి = పైన చెప్పబడినవిధంగా, ఉభయచ్యుతః = దేవతలు, రాక్షసులు ఇద్దరి చేత విడువబడ్డాను (నిర్లక్ష్యం చేయబడ్డాను). విశరణః = ఆశ్రయం లేకుండా ఉన్నాను, అహమ్ రక్ష్యః = నేను రక్షింపదగినవానిని, ఇతి+ఆదయః = మొదలయిన పలుకులచే, త్వత్+పాద ప్రణతౌ = నీ పాదాలకు నమస్కారం చేసిన, నిర్ఋతేః = నైరృతుని యొక్క, అతి+ఆకులాః = బాగా క్షోభ చెందిన, ప్రార్థనాః = ప్రార్థనలు, జయంతి = జయింపబడుచున్నవి (తప్పక ఫలిస్తాయి).

తాత్పర్యము

దేవీ! చాలా బాధపడుతున్న నైరృతుడు నీ పాదాల వద్ద సాష్టాంగ ప్రణామం చేసి ఇలా ప్రార్థించాడు:

"నేను ధర్మానికి మరియు దాని ఆచారానికి కట్టుబడి ఉన్నందున నేను నా జాతికి చెందిన రాక్షసులచే అవమానించబడ్డాను; శత్రు జాతి నుండి వచ్చిన కారణంగా నన్ను ద్వేషించే దేవతలు, వేదాలచే అసహ్యించబడిన నైరుతి దిక్కును నాకు ఇచ్చారు (ఈ దిక్కు ఏ శుభకార్యాలకు తగినది కాదు); నా దురదృష్టం కారణంగా నేను ఈ విధంగా ఇద్దరిచే నిర్లక్ష్యం చేయబడ్డాను; నేను నీ పాదాలు తప్ప వేరే ఆశ్రయం లేకుండా ఉన్నాను; నేను రక్షించబడాలి."

ఈ విధమయిన నైరృతుని ప్రార్థనలు తప్పక ఫలిస్తాయి.

విశేషములు

నైరృతుని దిక్కు అధిపతిని గూర్చి వివరణ:

దక్షిణ పశ్చిమముల మధ్యభాగం నైరుతి. దీనికి అధిపతి నైరుతి లేదా నిర్ ఋతి. 'ఋతి' అనగా పీడ, వ్యాధి, అజ్ఞానము, అసత్యము, ఆక్రమణ అని అర్థము. ఇవేమీ లేనివాడు 'నిర్ ఋతి'. ఇతను 'యాదసాంపతి' అనగా రాక్షసపతి అలాగే జలాధిపతి. రాక్షసపతి లేవకుండా ఉండాలనే కారణంతో నైరుతి భాగంలో బరువును ఉంచుట ఇప్పటికీ ఆచారం. నైరుతి భాగంలో బావిగాని గొయ్యిగాని తవ్విన యెడల జలాధిపతి అయిన నైరుతి ఆ భాగాన్ని ఆక్రమించి ఇంటికి అనర్థము కలిగిస్తాడు. పేరుకు రాక్షసుడైనా అష్టదిక్పాలకులలో ఇతనికి దిక్పాలకత్వము, దేవత్వము లభించింది. బ్రహ్మ యక్షులను, రాక్షసులను సృష్టించగా వారు ఆకలిగొని సృష్టించిన బ్రహ్మనే తినటానికి యత్నించగా తాను సృష్టించిన తండ్రినని, భక్షించరాదని బ్రహ్మ వారించెను. 'మారక్షత' అనగా రక్షించవద్దు అని కొందరు 'జక్షత' అనగా రక్షించమని కొందరు అని పరుగెత్తగా 'మారక్షత' అన్నవారు రాక్షసులుగా 'జక్షత' అన్నవారు యక్షులుగా పేరుపొందారు. అదే సమయంలో దక్షిణ పశ్చిమ మధ్యభాగం నుండి ఒక రాక్షసుడు 'పితరం రక్షత సదా' అనగా ఎప్పుడూ పితృదేవుడిని రక్షించాలని వారికి అడ్డునిలిచెను. అతని పితృ భక్తికి సంతసించిన బ్రహ్మ అతనికి దేవత్వమును ప్రసాదించి అతడు ఏ దిక్కునుండి వచ్చాడో ఆ దిక్కుకి అతనిని అధిపతిగా నియమించెను. రాక్షసత్వము, దైవత్వము, కాఠిన్యము, పరుషత్వము, శాంతత్వము ఇతని ప్రత్యేకతలు. నైరుతి దిగ్భాగంలో దోషం ఉంటే ఇల్లు త్వరలో అన్యాక్రాంతం అవుతుంది. భూమికి, రాజ్యానికి, ఆస్తికి అధిపతి కావాలంటే నైరుతిని పూజించాలి.

---

శార్దూలవిక్రీడితము

మత్పుత్ర్యామమ వా ముకుందగృహతాభాగ్యం న సంక్షీయతాం

మాహంపాయిషి కుంభజేన మునినా కల్పాంతసూర్యేణ వా .

ద్వేధామే సురవాహినీదయితతా సాధు త్వయా రక్ష్యతాం

త్వత్పాదాంబుజపాతినోజలపతేరిత్థం జయంత్యర్థనాః .. 64..

---

ప్రతిపదార్థము

మత్+పుత్ర్యా = నా కూతురికి (లక్ష్మికి), వా = లేక, మమ = నాకు, ముకుందగృహతాభాగ్యం = విష్ణువు గృహములో నివసించే భాగ్యం, సంక్షీయతాం న = క్షీణించకూడదు. కుంభజేనమునినా = కుండలో జన్మించిన అగస్త్యునిచేత, వా = లేక, కల్పాంతసూర్యేణ = కల్పాంతమున సూర్యునిచేత, అహం = నేను, మా+పాయిషి = నన్ను త్రాగనీయకుము. మే = నాకు, సురవాహినీ = దేవతల సైన్యానికి (ఆకాశగంగకు), దయితతా = ప్రియమైన, ద్వేధా = జంట స్థానాన్ని, సాధు = లెస్సగా, త్వయా = నీచేత, రక్ష్యతాం = రక్షింపబడుగాక! ఇత్థం = ఈవిధముగా, త్వత్+పద+అంబుజపాతినః = నీయొక్క పాదపద్మములకు సాష్టాంగ నమస్కారము చేసిన, జలపతేః = వరుణుని యొక్క, అతి+అర్థనాః = ఎక్కువ ప్రార్థనలు, జయంతి = జయింపబడుచున్నవి.

తాత్పర్యము

నా కూతురికి (లక్ష్మికి) లేక నాకు విష్ణువు గృహములో నివసించే భాగ్యం క్షీణించకూడదు. కుండలో జన్మించిన అగస్త్యునిచేత లేక కల్పాంతమున సూర్యునిచేత నేను త్రాగబడకుండా నన్ను రక్షించుము. మందాకిని (సురవాహినీ దేవత) యొక్క భర్తగా మరియు సేనకు అధిపతిగా నన్ను బాగా రక్షించు. ఈవిధముగా నీయొక్క పాదపద్మములకు సాష్టాంగ నమస్కారము చేసిన వరుణుని యొక్క ఎక్కువ ప్రార్థనలు జయింపబడుచున్నవి.

విశేషములు

1. వరుణాలయం: వరుణస్య ఆలయః సముద్రః - వరుణునికి ఆలయము, ఇల్లు. సముద్రము.
2. వరుణ: వృణోతి ఆచ్ఛాదయతి సర్వమ్, వ్రియతే జనైః - అన్నింటిని ఆచ్ఛాదించువాడు; జనులచే వరింపబడువాడు. వరుణుడు, పశ్చిమ దిశాధిపతి.
3. కల్పాంతం: కల్పాంతంలో సంభవించే ప్రళయం. బ్రహ్మమానం ప్రకారం నూరు సంవత్సరాలు, కొన్నివేల మహా యుగాలు నిండినప్పుడు ఈ ప్రళయం సంభవిస్తుంది. సృష్టికి పూర్వం వలె మూల ప్రకృతి మాత్రమే అప్పుడు ఉంటుంది.
4. అగస్త్యుని సముద్ర పానము: కశ్యప ప్రజాపతికి కాలయందు పుట్టినవారు కాలకేయులు. వీరు మహాదుర్మార్గులు. సముద్రమున దాగి ఉండి బహువిధముల దేవతలను బాధించుచుండగా అగస్త్యుడు దేవతలచేత ప్రార్థింపబడి వీరి వాసస్థానము ఐన సముద్రము యొక్క జలమునంతయు పానముచేసెను.

---

శార్దూలవిక్రీడితము

విశ్వప్రాణమయీత్వమేవ, మమ తు ప్రాహుర్జగత్ప్రాణతాం

సర్వస్యాపిసదా గతిర్హి భవతీ, మామేవమాహుర్జనాః .
లజ్జాపాదకమీదృశంజనని! నః, కిం కుర్మహే,పాహిమా-
మిత్యేవంపవనస్య తే పదనతౌ వాచోజయంత్యాకులాః .. 65..

---

ప్రతిపదార్థము

జనని! = తల్లి! పార్వతీ! త్వమ్+ఏవ = నీవే, విశ్వప్రాణమయీ = విశ్వంలోని సమస్త ప్రాణుల స్వరూపిణివి. తు = కానీ, మమ = నన్ను, జగత్ ప్రాణతాం = ప్రపంచానికి ప్రాణమని (ప్రాణితి జీవతి అనేన దీనితో జీవింతురు. ప్రాణవాయువు), ప్రాహుః = పిలుస్తారు. భవతీ = నువ్వు (భాతి దీప్తో భవతి, దీపయతి ప్రకాశించునది; మీరు.), సర్వస్య+అపి = అందరికి, సదా = ఎప్పుడూ, గతిః హి = ఆశ్రయం, తు = కానీ, మామ్+ఏవ = నన్ను, జనాః = జనులు, సదాగతిః = ఎప్పుడూ కదిలేది అని (సదా గతిః యస్య ఎల్లపుడు గమనం గలవాడు. వాయువు), ప్రాహుః = పిలుస్తారు. ఈదృశం = ఇది (అంటే మీ పేర్లు మరియు నా పేర్లు ఒకేలా ఉండటం) లజ్జాపాదకమ్ నః = నాకు అవమానకరం, కిం కుర్మహే = నేను ఏమి చెయ్యగలను? మామ్ = నన్ను, పాహి = రక్షించండి. ఇతి+ఏవం = ఈవిధముగా, తే పదనతౌ = నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తూ చేసిన, పవనస్య = గాలిదేవునియొక్క (పవనః= పునాతి పవిత్రము చేయునది. గాలి.), ఆకులాః వాచః = క్షోభ చెందిన మాటలు (ఆకులః= అత్యంతం క్షుబ్ధః అసంగతశ్చ క్షోభ చెందినవాడు;), జయంతి = ఫలిస్తాయి.

తాత్పర్యము

తల్లీ! నీ పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తున్న వాయుదేవుని ప్రార్థనలు ఇవి:

"నువ్వు మాత్రమే విశ్వంలోని సమస్త ప్రాణుల స్వరూపిణివి, కానీ ప్రజలు నన్ను ప్రపంచానికి ప్రాణం అని పిలుస్తారు. నువ్వు మాత్రమే అన్ని సమయాలలో (సదాగతి) అందరికి ఆశ్రయం, కానీ ప్రజలు నన్ను ఎప్పుడూ కదిలేది (సదాగతి) అని పిలుస్తారు. ఇది (అంటే మీ పేర్లు మరియు నా పేర్లు ఒకేలా ఉండటం) నాకు అవమానకరం. నేను ఏమి చేయగలను? దయచేసి నన్ను రక్షించండి."

ఇలా బాధతో చేసిన వాయుదేవుని ప్రార్థనలు ఫలిస్తాయి.

---

శార్దూలవిక్రీడితము

శంఖోల్లాసిగలోజ్జ్వలే!సమకరే! పద్మేన, కుందస్మితే!
పాదాగ్రాదృతకచ్ఛపే!ముఖమహాపద్మే! ముకుందాశ్రితే! .
ఇత్యస్మన్నిధిగాత్రి!నీలనయనే! చర్చాత్మికే! పాహిమా-
మిత్థంపాదనతిః శివే! విజయతే సఖ్యుః కుబేరస్య తే .. 66..

---

ప్రతిపదార్థము

శివే! = శుభప్రదురాలా! పార్వతీదేవీ!, శంఖ+ఉల్లాసి = శంఖములా ప్రకాశించే, గల+ఉజ్జ్వలే = బాగా వికసించిన కంఠము కలదానా! (కుబేరుని నవ నిధులలో ఒకటయిన శంఖ నిధితో మెరిసేదానా! అని ఇంకొక అర్థం), పద్మేన సమకరే = పద్మముతో సమానమయిన చేతులు కలదానా! (కుబేరుని నవ నిధులలో ఒకటయిన పద్మ నిధితో మెరిసేదానా! అని మరొక అర్థం, సమకరే= కుబేరుని నవ నిధులలో ఒకటయిన మకర నిధితో మెరిసేదానా!), కుందస్మితే! = తెల్లటి మల్లెపూవు లాంటి

చిరునవ్వు కలదానా! (కుబేరుని నవ నిధులలో ఒకటయిన కుంద నిధితో మెరిసేదానా! అని మరొక అర్థం), పాద+అగ్ర+ఆదృతకచ్ఛపే = పాదముచివర ఆదరింపబడిన తాబేలు కలదానా! (కుబేరుని నవ నిధులలో ఒకటయిన కచ్ఛప నిధిని ఆదరించినదానా! అని మరొక అర్థం), ముఖమహాపద్మే! = గొప్పదయిన పద్మంలా వికసించిన ముఖం కలదానా! (కుబేరుని నవ నిధులలో ఒకటయిన మహాపద్మ నిధిలా మెరిసే మోము కలదానా! అని మరొక అర్థం), ముకుంద+ఆశ్రితే! = (ముకుం మోక్షం దదాతి) మోక్షము నిచ్చువాడయిన విష్ణువుకు ఆశ్రయమైనదానా! ((కుబేరుని నవ నిధులలో ఒకటయిన ముకుందనిధికి ఆశ్రయమయినదానా! అని మరొక అర్థం), నీలనయనే = నల్లని కలువపువ్వులవంటి కళ్లు కలదానా! ((కుబేరుని నవ నిధులలో ఒకటయిన నీలనిధికి ఆశ్రయమయినదానా! అని మరొక అర్థం), చర్చ+ఆత్మికే! = శ్రేష్ఠమయిన చందన పరిమళంతో అభిషేకించబడిన రూపం కలదానా! (చర్చంతి ఆలోచయంతి అస్యామ్ దీనియందు అందరు ఆలోచింతురు) (శ్రేష్ఠమయిన అను అర్థాన్నిచ్చు వరమను కుబేరుని నవ నిధులలో ఒకదానిని కలదానా! అని మరొక అర్థం), ఇతి+అస్మత్+నిధిగాత్రి = ఈ విధంగా మాకు ప్రయోజనం కలిగించు తొమ్మిది నిధులు (లేదా సంపదలు) నీ శరీరంలో కలదానా! ఇత్థం = ఈ విధంగా, మామ్ = నన్ను, పాహి = రక్షించమని, తే = నీకు, సఖ్యుః కుబేరస్య = సఖుడయిన కుబేరుడు, పాదనతిః = పాదాల వద్ద చేసిన సాష్టాంగ నమస్కారం, విజయతే = జయింపబడుచున్నది.

తాత్పర్యము

శాంకరీ! నీ మిత్రుడు కుబేరుడు, నీ పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తూ చేసే ప్రార్థనలు ఇవి:

"నువ్వు శంఖం లాంటి మెడతో లేదా శంఖ నిధితో మెరుస్తూ ఉంటావు. నీకు కమలం లాంటి చేతులు ఉన్నాయి (లేదా మీ చేతిలో మకర మరియు పద్మ నిధులు ఉన్నాయి). నీ చిరునవ్వు తెల్లటి మల్లెపూవు లేదా కుండ నిధిలాంటిది. నీ శ్రీపాదము తాబేలు వంటిది (లేదా నీ శ్రీపాదము కచ్ఛప నిధితో ఉన్నది). మీ ముఖం వికసించిన తామర పువ్వులా ఉంది (లేదా మహాపద్మ నిధిలాగా ఉన్నది). నువ్వు విష్ణువు (లేదా ముకుంద నిధి) యొక్క ఆశ్రయం. నీ కళ్ళు నీలి కలువ పువ్వుల్లా ఉన్నాయి (లేదా నీల నిధిలాగా ఉన్నాయి). నీ రూపం పరిమళంతో అభిషేకించబడింది (లేదా వర వంటిది). ఆ విధంగా తొమ్మిది నిధులు (లేదా సంపదలు) నీ రూపాన్ని ఏర్పరుస్తాయి. దయచేసి నన్ను రక్షించండి.'' అని చేయు కుబేరుని ప్రార్థనలు తప్పక ఫలిస్తాయి.

విశేషములు

1. కచ్ఛము: కచ్ఛేపిబతి జలప్రదేశంలో వుండి జలమును తాగునది. తాబేలు. కచ్ఛం ముఖసంపుటం పాతి చిప్పలలో ముఖమును రక్షించుకొనునది. తాబేలు.
2. నవనిధులు: 1. మహాపద్మము, 2. పద్మము, 3. శంఖము, 4. మకరము, 5. కచ్ఛపము, 6. ముకుందము, 7. కుందము, 8. నీలము, 9. వరము లేక ఖర్వము. [ఇవి కుబేరుని నవనిధులు].
3. విజయతే: వి + జి ధాతు రూప - జిభాషార్థః చ - చురాదిః - కర్తరి ప్రయోగము ఆత్మనేపది లట్ లకారము. ప్రథమపురుష విజాయయతే / విజయతే, విజాయయేతే / విజయేతే, విజాయయన్తే / విజయన్తే.

---

శార్దూలవిక్రీడితము

సన్నామేషభవత్పదాంబుజనఖచ్ఛాయాం జటాసంగినీం

గంగేత్యాలిజనావదంతి వితథం మా భూర్ముధా కోపినీ

దృష్టిర్మయ్యయి!నీయతాం, పరుషమప్యేకం వచో దీయతా-

మీశానస్యభవాని! తే పదనతావిత్థం జయంత్యర్థనాః .. 67..

---

ప్రతిపదార్థము

భవాని! = శివుని భార్య వైన భవానీ (భవస్య పత్నీ). సత్ = ఉత్తమమైన, నామేషు = కోపతాపాలలో (నీ పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తున్నప్పుడు), భవత్ = నీ యొక్క, పద+అంబుజ = పాదపద్మములలోని, నఖత్+ఛాయాం = తెల్లని గోళ్ల ప్రకాశం, జటాసంగినీం = నా తలపై ఉన్న జటాజూటంలో కలిసిపోతుంది. (దీనిని చూసి) గంగా = గంగ, ఇతి = అని, అలిజనాః = నీ స్నేహితురాళ్ళు, వితథం = అసత్యాన్ని (విగతం తథం (= తథ్యమ్, సత్యమ్) యస్మాత్] తథ్యం (= సత్యం) కానిది. అసత్యము.), వదంతి = చెప్పుచున్నారు. (అందువలన) మా భూః ముధా = అనవసరంగా, వృథాగా, కోపినీ = కోపవంతురాలివిగా, మా భూః = కాకుము. అయి! = ఓ భవానీ!, మయి = నాయందు, దృష్టిః = చూపును, నీయతాం = ప్రసరింపచేయవలసినది. పరుషమ్+అపి = కఠినమయినప్పటికీ, ఏకం వచః = ఒక్క మాట అయినా, దీయతామ్ = మాట్లాడవలసినది. తే పదనతౌ = నీ పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తూ, ఇత్థం = ఈ విధముగా చేసిన, ఈశానస్య = ఈశాన దిక్కుకు అధిపతి అయిన శివుని, అతి+అర్థనాః = ప్రార్థనలు, జయంతి = జయింపబడుచున్నవి.

తాత్పర్యము

భవానీ! ప్రేమ గొడవల సమయంలో నిన్ను శాంతింపజేయడానికి ఈశానుడు (ఈశాన దిక్పాలకుడు) నీ పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తూ ఇలా ప్రార్థిస్తున్నాడు:

"నేను నీ పాదాల వద్ద సాష్టాంగ నమస్కారం చేస్తున్నప్పుడు, నీ తామర పాదాలలోని తెల్లని గోళ్ల ప్రకాశం నా తలపై ఉన్న జటాజూటంలో కలిసిపోతుంది. నీ స్నేహితులు దీనిని గంగ అని తప్పుగా పిలుస్తున్నారు. అందువలన దానిని సవతిగా భ్రమించి అనవసరంగా కోపం తెచ్చుకోకు. దయచేసి నాపై ఒక చూపు ప్రసరించు; కఠినంగా ఉన్నా సరే- కనీసం ఒక్క మాట అయినా మాట్లాడు."

ఈశానుడు చేసిన ఈ ప్రార్థనలు తప్పక ఫలిస్తాయి.

విశేషములు

శివుడు తన భార్యను ప్రార్థించే సమయంలో భవానీ (శివుని భార్య) అను సంబోధన కవి సమయ స్ఫూర్తికి నిదర్శనం. తాను శివుని భార్య కనుక తప్పనిసరిగా తన మాటను వింటుందని మధురమైన అంతరార్థం.

నీయతామ్: ణీఞ్ ప్రాపణే - భ్వాదిః లోట్ లకారః ఆత్మనేపదమ్ ప్రథమపురుషః నీయతామ్ నీయేతామ్ నీయన్తామ్.

దీయతామ్: దీఙ్ క్షయే - దివాదిః - లోట్ లకారః ఆత్మనేపదమ్ ప్రథమపురుషః దీయతామ్ దీయేతామ్ దీయన్తామ్.

---

శార్దూలవిక్రీడితము

నాభీతోఽభవమాదితస్తవబలాత్పశ్చాదభీతోఽస్మ్యహం

త్వత్క్షేణవిముఖీకృతోఽపి చతురాస్యోఽహం తవైవ స్తవైః .

త్వంవిశ్వాత్మతయోపజన్య న పునః స్రష్టారమాఖ్యాహిమా-

మిత్థందేవి! జయన్తి తే పదనతౌ వాణీపతేర్వాణయః||68

---

ప్రతిపదార్థము

దేవి! = పార్వతీదేవి!, అహం = నేను, ఆదితః = మొదట్లో, అభీతః న అభవమ్ = విముక్తి పొందలేదు. తవ బలాత్ = నీ బలమువలన (నీ అనుగ్రహం వల్ల), పశ్చాత్ = తర్వాత, అభీతః+అస్మి = భయాన్ని విడిచిపెట్టాను. త్రి+అక్షేణ = మూడు కన్నులు కలిగిన శివునిచే, విముఖీకృతః+అపి = వికారమైన ముఖాలు కలవాడిని అయిప్పటికీ, తవ+ఏవ = నిన్నే, స్తవైః = స్తుతించడం వలన, అహం = నేను, చతుర+ఆస్యః = నాలుగు ముఖాలు (లేదా నేర్పైన మాటలు) కలిగి ఉన్నాను. త్వం = నువ్వు, విశ్వ+ఆత్మతయా = విశ్వాత్మకురాలివై, ఉపజన్య = సృష్టిని వృద్ధి పొందించుదానివి కావటం వలన, పునః = మరలా, మామ్ స్రష్టారమ్ ఆఖ్యాహి న = నన్ను సృష్టికర్త అను పేరుతో పిలువకండి (అమ్మవారే సృష్టికర్త అని తాను కాదని బ్రహ్మ మాటల లోని ఆంతర్యం). ఇత్థం = ఇట్లు, తే పదనతౌ = నీ పాదములకు సాష్టాంగ నమస్కారము చేయు, వాణీపతేః = బ్రహ్మ యొక్క, వాణయః = ప్రార్థనలు, జయంతి = జయింపబడుచున్నవి.

తాత్పర్యము

దేవీ! బ్రహ్మ (వాణిపతి) నీ పాదములకు సాష్టాంగ నమస్కారము చేసి ఇలా ప్రార్థించాడు:

"నేను మొదట్లో భయం నుండి విముక్తి పొందలేదు. నీ అనుగ్రహం వల్ల నేను తర్వాత భయాన్ని విడిచిపెట్టాను. నేను శివునిచే (మూడు కన్నులు) వికారమైనప్పటికీ (నాలుగు వేదాల రూపంలో) నిన్ను స్తుతించడం వల్ల నాకు నాలుగు ముఖాలు (లేదా నేర్పైన మాటలు) కలిగి ఉన్నాను. మీరు మొత్తం విశ్వాన్ని సృష్టించి, వ్యాపించి ఉంటారు; కాబట్టి నన్ను సృష్టికర్త అని ప్రత్యేకంగా పిలవకండి."

ఇలా చేసిన బ్రహ్మ యొక్క ప్రార్థనలు ఫలిస్తాయి.

విశేషములు

దేవి అనుగ్రహంతో విష్ణువు మధు మరియు కైటభ రాక్షసుల సంహారం చేసే సందర్భంలో మొదట బ్రహ్మకు భయం ఏర్పడింది. విష్ణువుయొక్క నాభిలో పద్మాసనంతో ఉన్న సమయంలో కూడా అస్థిర భావం వలన బ్రహ్మ భయపడ్డాడని భట్టాత్రి చమత్కారం.

ఒకసారి శివుడు లింగాకారాన్ని ధరించి పెరిగినప్పుడు, బ్రహ్మ హంస రూపాన్ని ధరించి అతని తలను కనుగొనడానికి ముందుకు సాగాడు. అతను విఫలమయ్యాడు, కానీ శివుని తలను చూశానని శివునితో అబద్ధం చెప్పాడు. కోపోద్రిక్తుడైన శివుడు బ్రహ్మ యొక్క ఐదు తలలలో ఒకదాన్ని తొలగించాడు, అది అప్పటి నుండి నాలుగు తలలుగా మారింది. దీనిని భట్టాత్రి 'విముఖీకృతః' (వికారమయ్యాయని) చమత్కరించాడు.

అమ్మవారిని స్తుతించడం వల్ల బ్రహ్మకు నాలుగు ముఖాలు (లేదా నేర్పైన మాటలు) కలిగి ఉన్నాడని రెండు అర్థాలతో 'చతురాస్యః' అను కవి ప్రయోగం మనోహరం.

"కమలంలో పుట్టిన బ్రహ్మ! ఈ లోకంలో నేను లేనిదేదీ నాకు కనిపించదు. ప్రతిదానిలో నేను ఉన్నాను. అందుచేత పూర్వం వలె సమస్త జీవులను సృష్టించు.'' అని అమ్మవారు దేవీభాగవతంలో చెప్పిన మాటలు ((3:6:11,30) ఈ శ్లోక మూడవ పాదము చదివే సమయంలో స్మరణీయాలు.

శార్దూలవిక్రీడితము

ఆశీరస్తిముఖే, విడంబయతి మాం భూయోఽపి చాశీఃస్పృహా

భోగాఃసంతి సహస్రధా, పునరహం భోగాన్ కథం ప్రార్థయే? .

శేషోఽహంస్పృహయామ్యశేషసుఖమిత్యేతచ్ఛహాసాస్పదం,

నాథే!చింతయ సర్వమిత్యహిపతేస్త్వత్పాదపాతోజయేత్ .. 69..

ప్రతిపదార్థము

నాథే! = ఐశ్వర్యవంతురాలా! పార్వతీదేవీ!, అహిపతేః = సర్పరాజయిన ఆదిశేషుడు (అహీనాం పతిః శేషః) త్వత్+పాదపాతః = నీ పాదములకు నమస్కరించినవాడగుచూ, సర్వం = తన సర్వవిషయములను గురించి, చింతయ = ఆలోచింపుము (అని నిన్ను ఇట్లు ప్రార్థిస్తున్నాడు). ముఖే = నా నోటిలో, ఆశీః = ఆశీస్సు, అస్తి = ఉన్నది. అపిచ = అయినప్పటికీ, భూయః = మరలా, మాం = నాకు, ఆశీః = ఆశీస్సు కావాలని నిన్ను, స్పృహా = కోరుట (స్పృహయతి తస్య భావః కర్మవా కోరబడునది.) విడంబయతి = వంచన అవుతుంది. (ఇక్కడ కవి రెండు అర్థాలు కలిగిన ఆశీస్సు అనే పదాన్ని శ్లేషగా వాడాడు. మొదటి ఆశీస్సుకు 1. పాము కోర అని 2. రెండవ ఆశీస్సుకు శుభమయిన వాక్కు అని అర్థం. ఆశీస్సులు కలిగిన నేను మరలా ఆశీస్సుల కోసం కోరుకోవటం ఎలా కుదురుతుందని శ్లేష చమత్కారం.) సహస్రధా = వేయి రకాలుగా; (సహస్ర ప్రకారేణ) భోగాః = భోగములు, సంతి = ఉన్నాయి. పునః = మరలా, అహం = నేను, భోగాన్ = భోగములు కావాలని నిన్ను, కథం = ఎట్లు, ప్రార్థయే? = ప్రార్థించెదను? (ఇక్కడ కవి రెండు అర్థాలు కలిగిన భోగ అనే పదాన్ని శ్లేషగా వాడాడు. మొదటి భోగమునకు 1. పాము పడగ అని 2. రెండవ భోగముకు సుఖమయిన అనుభవము అని అర్థం. భోగములు కలిగిన నేను భోగాలు కావాలని ఎలా ప్రార్థిస్తాను? అని ఉక్తి చమత్కారం.) అహం = నేను, శేషః = స్వయముగా శేషుడను. (అయినా) అశేషసుఖమ్ = సంపూర్ణమయిన సుఖాన్ని, స్పృహయామి = (నీదగ్గరనుంచి) కోరుకుంటున్నాను. ఇతి+ఏతత్+చ = నా కోరికలన్నియూ కూడా, హాస+ఆస్పదం = ఎగతాళికి గురయ్యే విషయాలు. (ఇక్కడ కవి శేష, అశేష పదాలను అందంగా ప్రయోగించాడు. శేషః అంటే మిగిలిపోవునది. (శిష్యతే ఉపయుక్తాదన్యః శేషః) అనగా ఎంత సుఖపడ్డా ఇంకా సుఖ పడటానికి మిగిలే ఐశ్వర్యము కలవాడని భావం. ఇక అశేష మిగలనిది, సంపూర్ణమయినది. (నాస్తి శేషః యస్య) ఎంత సుఖపడ్డా ఇంకా సుఖ పడటానికి మిగిలే ఐశ్వర్యము కలవాడినయినప్పటికీ, ఇంకా సంపూర్ణమయిన సుఖం కావాలని నిన్ను కోరుకొంటే నేను నవ్వులపాలవుతానని ఆదిశేషుని మాట.) జయేత్ = ఇలా నిన్ను అందంగా వేడుకొనే శేషుని ప్రార్థనలు ఫలించుగాక!

తాత్పర్యము

ఈ శ్లోకంలో ఆదిశేషుడు పార్వతీ దేవిని ప్రార్థిస్తూ, తనకున్న గొప్పతనం గురించి వివరిస్తూనే, తన కోరికలు ఎంత హాస్యాస్పదంగా ఉన్నాయో అంగీకరిస్తున్నాడు. తన నోటిలో 'ఆశీస్సు' (పాము కోర/శుభవాక్కు) ఉన్నందున తిరిగి ఆశీస్సులను కోరడం వంచన అవుతుందని, వేయి రకాల 'భోగములు' (పాము పడగలు/సుఖాలు) తనకున్నందున తిరిగి భోగాలను కోరడం తగదని అంటున్నాడు. స్వయంగా 'శేషుడు' (అనంతమైన సుఖం కలవాడు) అయిన తాను 'అశేష సుఖం' (సంపూర్ణ సుఖం) కోరుకోవడం ఎగతాళికి గురయ్యే విషయమని వినమ్రంగా తెలుపుతున్నాడు. తన సర్వ విషయాలను ఆలోచించమని దేవిని వేడుకుంటున్నాడు. ఇలా అందంగా వేడుకొనే శేషుని ప్రార్థనలు ఫలించుగాక!

విశేషములు

1. ఆశీ: ఆశృణాతి హినస్తి హింసించునది కనుక పాము కోరను ఆశీ అంటారు.
2. జయేత్: జి ధాతువు విధిలిజ్ ప్రథమపురుష: జయేత్ జయేతామ్ జయేయు:.
3. ప్రార్థయే: ప్ర + అర్థ ధాతు రూపము - లట్లకారము అర్థ ఉపయాచ్ఞాయామ్ — చురాదిః కర్తరి ప్రయోగ ఆత్మనేపది ఉత్తమ పురుష ప్రార్థయే / ప్రార్థే - ప్రార్థయావహే / ప్రార్థావహే- ప్రార్థయామహే / ప్రార్థామహే.

4. చిన్తయ: చితిస్మృత్యామ్ - చురాదిః కర్తరి ప్రయోగః లోట్ లకారః పరస్మైపదమ్ మధ్యమ పురుషః చిన్తయతాత్ / చిన్తయతాద్ / చిన్తయ - చిన్తయతమ్ - చిన్తయత.

శేషుడు పతంజలిగా మహాభాష్యాన్ని రచించాడు. అందుకే అతను చేసిన దేవీ ప్రార్థనకు, మిగతావారి ప్రార్థనలకు తేడా గమనించవచ్చు.

---

శార్దూలవిక్రీడితము

పార్వత్యాఃపదమత్ర దృశ్యమితి వా పాదే భవత్వేనవా
సాధుత్వాత్తదుపాస్తయేహితతయా పద్యాన్యమూని స్ఫుటం .
సైషాముక్తిపురీగిరీంద్రతనయాభక్తేన నారాయణే-
నాబద్ధాఖలు సప్తతిర్దిశతు వః కల్యాణహల్లోహలమ్ ||70

---

ప్రతిపదార్థము

అత్ర = ఈ అన్ని శ్లోకాలలో, పార్వత్యాః పదమ్ = పార్వతి యొక్క పాదాలు, దృశ్యమ్+ఇతి = కనిపిస్తాయి. వా = లేదా, పాదే = శ్లోకములోని ప్రతి పాదములో, భవత్వేన వా = అమ్మవారి పాదాలను ఎలా సేవించాలో సూచనలున్నాయి. సాధుత్వాత్ = మంచితనముతో, తత్+ఉపాస్తయే = ఆమె పాదాలు సేవించాలనుకొనే భక్తులకు, హితతయా = ప్రయోజన కారులుగా, అమూని పద్యాని = ఈ శ్లోకాలు, స్ఫుటమ్ = స్పష్టముగా ఉన్నాయి. సా ముక్తిపురీగిరీంద్రతనయా = ఆ ముక్తిపురి లోని వాసముంటున్న పార్వతీదేవియొక్క, భక్తేన నారాయణేన = భక్తుడయిన నారాయణ భట్టాత్రి చేత, ఆబద్ధాః = బంధింపబడిన (రచింపబడిన), ఖలు ఏషా సప్తతిః = ఈ డెబ్బయి శ్లోకాలు కలిగిన ఈ శ్రీపాద సప్తతి, వః = మీకు (చదువరులయిన మీకు), కల్యాణహల్లోహలమ్ = శుభగౌరవాన్ని, దిశతు = ఇచ్చుగాక!

తాత్పర్యము

ఈ అన్ని శ్లోకాలలో పార్వతి పాదాలు కనిపిస్తాయి కాబట్టి ఈ శ్లోకాలు స్పష్టంగా పద్యాలు; పద్యాలు పాదాలకు నిర్దేశించబడ్డాయి; మరియు ఈ సప్తతి శ్లోకాలు పాదాలను స్తుతించాలనుకునే భక్తుల ప్రయోజనం కోసం ఉన్నాయి. ముక్తిపురిలో ఉన్న హిమవంతుని పుత్రిక అయిన పార్వతీదేవి భక్తుడైన నారాయణ భట్టాత్రి రచించిన శ్రీపాద సప్తతి అనే ఈ శ్లోకగ్రంథం మీకు (పాఠకులకు) అనంతమైన ఐశ్వర్యాన్ని అందించుగాక.

విశేషములు

- ఈ చివరి శ్లోకం 'ఫలశ్రుతి' (= ఏదైనా ఒక విషయాన్ని పఠించినప్పుడు, ఏదైనా ఒక స్తోత్రం రచించినప్పుడు ఫలానా ఫలితం కలుగుతుందని చెప్పే విధానం.) రూపంలో ఉంది. పార్వతీ దేవీ పట్ల తనకున్న అపూర్వమైన భక్తిని మరియు కవిగా తనకున్న అత్యున్నతమైన సామర్థ్యాన్ని ఆయన ఈ శ్లోకంలో మరోసారి చాలా అద్భుతంగా చెప్పాడు.
- కావ్యప్రకాశంలో పదాలు నాలుగు రకాలని చెప్పారు:
    - యౌగికము: ధాతు-ప్రత్యయముల సంబంధంలో వచ్చిన అర్థము. ఇందులో అవయవార్థం చెప్పవచ్చు. ఉదా. జనకసుతా - జనకుని కూతురు.

- రూఢము: ధాతు ప్రత్యయార్థాలను వదిలి అర్థము నిచ్చు శబ్దము. ఇందులో అవయవార్థం చెప్పలేము. ఉదా. ఎలుక, మూషకం.
- యోగరూఢము: (వ్యవహారికార్థము గల శబ్దము) ఇందులో అవయవశక్తి ఉంటూ సముదాయ రూపంలో ఒక అర్థాన్ని చెప్పవచ్చు. ఉదా. పంకజం. పంకం నుంచి పుట్టిన అర్థం ఉన్నా పంకంలో పుట్టినవాటిని అన్నింటినీ పంకజం అనకూడదు. పద్మానికి మాత్రమే ఆ పేరు.
- యౌగికరూఢం: - అవయవశక్తి చేత ఒక అర్థాన్ని, రూఢి చేత మరొక అర్థాన్నీ బోధించేవి యౌగికరూఢాలు. ఉదా. ఉద్భిత్. అనగా యోగంచేత భూమిని బ్రద్దలు కొట్టుకొని పైకి వచ్చే మొక్క, చెట్టు అని అర్థం. రూఢిచేత ఒక యాగం అని అర్థం.

* భట్టాత్రి ఈ శ్లోకంలో ప్రయోగించిన పద్యమ్ అనే పదం ఈ నాలుగు రకాలుగాను పరిణమిస్తుండుట గమనార్హం.
    - పద్యము అనగా త్రోవ. పాదాయ హితా పాదములకు హితమైనది. యౌగికము.
    - పదాని చత్వారి పదాని అర్హతి నాలుగు చరణములు కలది. రూఢము.
    - పద్యమంటే బాగా నీరు లేనిది, ఎండిపోని బురద మొదలయిన అర్థాలను చెప్పవచ్చు కాని వీటన్నింటిని పద్యమనలేము. పద్యమంటే నాలుగు పాదాలు కలిగిన విశేష ప్రక్రియ. యోగరూఢము.
    - పాదః విధ్యంతి శర్కరాః కంటకాః వా కాళ్లకు గ్రుచ్చుకొనునవి. గులకరాళ్లు; ముండ్లు అని ఒక అర్థం. అని అవయవశక్తి చేత ఒక అర్థము రూఢి చేత నాలుగు చరణములు కలది అని మరొక అర్థం.

అమ్మదయతో తెలుగులో ఇంతవరకు ఎవరూ స్పృశించని ఈ 70 శ్లోకాల సంస్కృత మూలాన్ని చూసి ఊరుకోలేక
తెలుగులో చెప్పాలనే బాల్య చాపల్యంతో చెప్పాను.

నేటితో(2-1-23) ఈ వ్యాఖ్య సమాప్తం.

ఎక్కడయినా నా రాత కోతలలో దోషాలు ఉండవచ్చు.

పిల్లల తప్పులను అమ్మ క్షమిస్తుంది కదా !

క్షమించమని ప్రార్థిస్తున్నాను.

ఆదరించిన వారికి , నిఘంటుకారులకు,వ్యాఖ్యాన కారులకు , పతంజలి నమస్సుమాంజలి.

———